శ్రీ

# మోహాన విజయము.

(సాంఘిక ప్రబంధము.)

గ్రంథ కర్త.
సాహిత్య శిరోమణి & ఉభయభాషా ప్రవీణ
వైద్య
కొండూరు నరసింహాచార్యులు,
ప్రధానాంధ్ర పండితులు.
పి. ఆర్. బోర్డు హైస్కూల్, జమ్మలమడుగు.

జమ్మలమడుగు
—: జ్యోతి :—
ముద్రాలయ ముద్రితము.

1951.

మొదటికూర్పు, 1000 ప్రతులు.



వెల రు. 2-0-0.

శ్రీ

# మోహాన విజయము.

(సాంఘిక ప్రబంధము.)



గ్రంథ కర్త.

సాహిత్య శిరోమణి అండ్ ఉభయభాషా ప్రవీణ

వైద్య

## కాండూరు నరసింహాచార్యులు,

ప్రధానాంధ్ర పండితులు.

పి. ఆర్. బోర్డు హైస్కూల్, జమ్మలమడుగు.

జమ్మలమడుగు



[illegible]

పుస్తకాలయ ముద్రితము.

**1951.**

మొదటికూర్పు, 1000 ప్రతులు.



వెల రు. **2-0-0.**

# అవతారిక.

## మోహన విజయము.



ఇది యొక సాంఘిక ప్రబంధము. కేవల కల్పిత గ్రంథమని త్రికరణశుద్ధిగాఁ జెప్పవచ్చును. "దీనిని సాహిత్య శిరోమణి" "ఉభయ భాషా ప్రవీణ" శ్రీమాన్ కాండూరి నరసింహా చార్యులు గారు జమ్మలమడుగు పి. ఆర్. బోర్డు హైస్కూలున ప్రధాన పండితులు రచించిరి.

ఇదిమూఁడాశ్వాసములతో ముచ్చటఁ గూర్చుచున్నది. గ్రంథ శైలింబట్టి విచారింప నాచార్యులవారు పూర్వాచార పరాయణు లనియు, గ్రాంథిక భాషాప్రియులనియు వ్యావహారిక భాషా పరాఙ్ముఖు లనియుఁ దెలియ వచ్చుచున్నది.

### —.•. ఇందలి కథ. .•.—

ధర్మపురంబను నుత్తమ పురంబున విశ్వపతియను మహా ధన వంతుఁడు, పరమ లోభియగు నొకపురుషుండు గలఁడు. అతని భార్య ధర్మాత్మురాలు. దైవభక్తి భరిత 'వసుంధర' యనునది. ఆమెతో నాతఁడు బద్ధానురాగుండై యుండువాఁడు గాఁడు. ఉన్నచో సంతా నము గలుగునేమో? దానివలన ధన వ్యయమగునేమో? యను భయము = కాని మరియొకటి కాదు. ఇట్లుండ నెట్లో కాల కర్మ

వశంబున వారికి మోహనుండను కొమారుఁడు పుట్టె. ఆతఁడు పుట్టినది మొదలుకొని విశ్వపతి ధనవ్యయమగుటకు మిక్కిలి పొక్కుచు, కొడుకునకే ముద్దుముచ్చటలును జెల్లించనేలేదుకదా! తుదకక్షరాభ్యాసమునైనను జేయించి బడికిఁ బంపించిన వాఁడుకాఁడు. తల్లి కొడుకునకు చదువులేదని యెంతో సంతాపించుచు నిజభర్తకుంజెప్పి ప్రయోజనంబు కాన కూరకుండెను. అంతలో మోహనునకుఁ బది రెండేండ్ల ప్రాయము వచ్చెను. ఇట్లుండునప్పు డొక్క తిరునాళ్లలో శంకరుండను దేశబంధువొకఁడు గాంధీ మతమనుసరించి ప్రజలకు ధర్మోపదేశముగా నుపన్యాస మొసంగు చుండెను. మో హ ను ఁ డా యుపన్యాసము నాద్యంతముగా విని, తనకుఁ జదువు లేమికిఁ దల్లడిల్లుచు తండ్రికడకు వచ్చి నిజమనోరథం బెఱింగించి తిరస్కృతుండై చేయునదెద్దియు లేక తల్లికింజెప్పి యొప్పించి తాను గాశికిం బయనంబై పోయె. అప్పుడు ధర్మపురంబు నంగల పౌరులెల్లరు మోహనుని యోగ్యతకును; విశ్వపతి యోగ్యతకును పొగిడి తెగడం జొచ్చిరి.

మోహనుఁడా వారణాసీపురంబున గంగాస్నానమును, విశ్వేశ్వరాది దేవతాదర్శనమును గావించుచు నొకానొక పండితునాశ్రయించి తనకిరువది రెండు సంవత్సరము లీడువచ్చులోగా సంస్కృతాది విద్యలే గాక “ఇంగ్లీషున” పట్టపరీక్ష జదివి కృతకృత్యుండై మొదటినుండియు దేశాభిమానము గలవాఁడు గావున నటనుండి కదలి కాశ్మీరంబునందలి శ్రీనగరంబునకుం జని యట ,,శ్రీహరి’’ యను వాని మైత్రిం బడసి, వారియింట కొంతకాలము నివసించి యుండె, ఆలోనా శ్రీహరి చెలియలు ,,సుశీల’’ యను కన్య మోహనుని—మోహనుఁడాసుశీలను

ప్రేమించి వివాహముంజేసికొను అభిప్రాయములు సూచ్యార్థ సూచనంబులుగా, జేసికొని యున్నవారు. అనంతరము కొన్నినాళ్లలో మోహనుఁడు సుశీలకు, శ్రీహరికిం జెప్పి దేశాటనము జేయువాఁడై బయలు దేరి-హిమవంతంబును గంగాద్వారంబును గాంచి యటనుండి నైమిశారణ్యము, బదరీకేదారము, కురుక్షేత్రము, మొదలగు దేశంబులు సేవించి తత్తద్విశేషంబు లెల్లంగ్రహించి ప్రపంచ జ్ఞానంబు నెంతయేని యుంగలిగికొన్నవాఁడయ్యె. ఈదేశాటన సమయమున మన గ్రంథకర్తగారు-తమ విజ్ఞానమంతయు-వింతగాఁ జూపి యున్నవారు.

సీ॥ "చలిమల యొడియందుఁ జల్లఁగ వికసించి
లలితమై పరఁగు "సిమ్లా" వెలుంగ
వ్యాపారరంగమై యేపారుటను జేసి
లాహోరు నగరంబు రమణనొప్ప
సిక్కులు కడుభక్తిఁ జెలఁగి యాత్రలు సల్పు
నమృత సరంబది యలరుచుండఁ
బొదల జీలముదొట్టి నదులైదు, పొలముల
గోధుమ పంటల గట్ట లడర.

గీ॥ సారవతా భూములను సాగు సాగుచుండఁ
గడుపులోఁ జల్లప్రజలకుఁ గదల కుండఁ
దూర్పుపంజాబు రాష్ట్రంబు తొంగలింప
మోహనుండందుఁ జరియించి ముదమునందె.

సీ॥ ఆరావళీ పర్వతావృతంబయి యొప్పు

నుదయసింహులుండేలు నుదయపురము
వితతారివర్గంబు వ్రీల్చిచెండాడిన
జయసింహుఁ డేలిన జయపురంబు
యవనమత్తగజంబుల డఁచుసింగంబులై
యోధరాణలు పొల్చుజోధపురము
రసపుత్ర వీరులింపెసఁ గంగనిరవొందు
చిత్తూరుదుర్గంబు చెలఁగుచోటు.

తే॥ తవిలివెన్నంటి రాణాప్రతాపసింహుఁ
డడరిశత్రుభయంకరుఁ డైనచోటు
పొలుచురాజ పుటానంబు పొలుపుఁగాంచి
సంతసించుచు నంతటసంచరించె."

ఇట్లు మోహనుండారాష్ట్ర వర్తంబంతయు సంచరించి, బొంబై నగరంబు కడసముద్రముం గాంచినంతలో తన తండ్రి జ్ఞప్తికి వచ్చుటంజేసి:—

ఉ॥ "తోరములైన సంపదలఁ దూఁగెదవంచెవఁడేని నిన్ను నే
పారఁగ నాశ్రయింపఁ, దగవానికి నీరము నీయలేవ హా!
బారుగ సంపదల్పొదలు పాపికి లోభగుణంబు మాడ్కినీ!
ఘోరగుణంబు నీకమరెసాగర! కర్మఫలంబదేమిటో?

ఆ॥ వె॥ గొప్పతనముఁ జూచి కోరిదగ్గఱఁజేరి
యప్పుబడగ వాని నట్టెకూల్తు

వప్పుఁగొనినవాని నతిముఱి పఱచుచుఁ
బట్టిసేల్చు ధనికు పనిడిఁదోఁప.

అని యన్యాప దేశంబుగా సముద్రుని, జెంద నాడినాఁడు, కాని రత్నాకరుండని పేరుపొంది లక్ష్మికిం దండ్రియై, కామధేను, కల్ప వృక్షాదులంగని, అమృతమునకాకరమై. శ్రీమహావిష్ణునిం దనయింటఁ గట్టుకొనిన మహోన్నతు నిట్లు దెగడి వర్ణించుట తటస్థింపదు కాని ఇప్పట్ల నిట్లు వర్ణించుట మిక్కిలి సమంజసముగ నున్నది. అట్లు చేసి మన మోహనుఁడు తల్లిదండ్రులకుం జాబువ్రాసి కొన్నినాళ్లలో ధర్మ పురింజేరి యెల్ల వారి కానందమూ పాదించినాఁడు. అంతలో తండ్రికా కొడుకువలన ధన వ్యయమగునేమో యనుచింత స్వాంతము నందె నను కొడుకునకు వివాహము నిశ్చయించి కన్యాదాతవలన విశేష ముగా "వరకట్నము" తీసికొనవచ్చునని కన్యాన్వేషణముజేసి కొన్ని వేల రూప్యములు కట్నమిచ్చు పద్ధతిని యొక సంబంధమును నిశ్చ యింప నెంచినాఁడు. అప్పుడు కుమారుఁడు "తండ్రీ! నేను గాశ్మీర ములో శ్రీహరి చెలియలు సుశీలయను కన్యామణిం బ్రేమించితి. ఆమెయు నన్నుఁ బ్రేమించె, నేనాకన్యంగాక మఱియొక కన్యం బెండ్లి యాడ" నని పట్టు పట్టెను. విశ్వపతియు నప్పట్ల దానెంత చెప్పినను లాభము లేమింజేసి తన యుద్యమమునుండి విరమించి కొడుకున కను కూలుండై సుశీలం దెచ్చి కోడలిం గావించుకొని, కొంచెము మానవ స్వభావము కలవాఁడై కొడుకు కారణంబున నించుక విరాగియై ధర్మ కార్యంబు లాచరించు వాఁడయ్యె.

వివాహా నంతరమున మోహనుఁడు సభార్యుఁడై ప్రతి దినము

గ్రామసంచారము చేయుచు ప్రకృత కాలపద్ధతి ననుసరించి-దేశపద్ధతులు-రాజ్యపాలనము లోనగునవి క్రమముగఁ బ్రజల కుపదేశించుచు తుదకు తాను ధర్మ పురపాలకుండై బ్రజల నత్యం తాను రాగంబునఁ జూచుచుండె, నీసందర్భమున మనకవిగారు మూఁడవ యాశ్వాసములో 80 పుటలో "మిత్రసత్తములారా!" యని సంబోధించుచు, కొన్ని విషయములు వ్రాసినారవి యిప్పటి యెన్నికలులోనగు వానినిఁదెలుపుచు నీతిని బోధించునవి యగుచున్నవి. ఇదియే మోహన విజయ కథాసంగ్రహము.

మన గ్రంథకర్తగారు సంస్కృతాంధ్రముల యందు మంచి సాహిత్య సంపద కలవారనుటకు సందేహములేదు. వీరు గ్రంథ మంతయు సంప్రదాయ సిద్ధముగానే వ్రాసియున్నారు. గాని యక్కడక్కడ కొన్ని ప్రమాద పతితములు గాఁ వచ్చెడిని. సంయుక్త పూర్వము గురువు కాకుంట కొందఱ మతంబున సమ్మతమే. అది రేఫ మునకు మాత్రమే! వీరిమతంబున లయాది సంయుక్త పూర్వము గురువు కాదని తెలియుచున్నది. మరియు పు, ఫు, బు, భుల్, మూలకేగాక వ, ఫ, బ, భలు-మాలకును యతింజెల్లించి యున్నారు. ఇదియును కొందఱమతమే యైనను నన్నయాదుల పాటించు నాచార్యులవారు దీనిం బాటించుట శ్రేయమేమో? యనినేఁ దలంచుచున్నాను—ఇట్లు వ్రాయుటచేఁ బైనుదహరించిన ప్రయోగములు తప్పులనుటకు నేను సాహసింపను. ఆచార్యుల వారా ప్రయోగముల కన్నింటికి నిప్పటి పెద్ద పెద్దల ప్రయోగము లుదాహరించిన నుత్తరంబు చెప్పుటకు వీలుండదేమో? యని నాసందేహము.

ఈ మోహన విజయములో నాచార్యులవారి కవిత్వము నాతి కఠిన మృదు మధురమైయున్నది. అందందు మంచి మంచి కల్పనల పూర్వములై యున్నయవి. దీనివలన ధనమార్జించి ధర్మకార్యములు చేయవలయును కాని లోభియై పిల్లికి బిచ్చము పెట్టకుండుట తగదనియు, పురుషుఁడై పుట్టినవాఁడు ముఖ్యముగా విద్యనేర్చి దేశాటనముఁజేసి-దేశీయుల కష్టసుఖంబులకునై మెలంగవలయునని, దాన నిహాపర సాధనంబగుననియు, నీ గ్రంథము బోధించుచున్నది. దీనిని పాఠశాలలలో పాఠ్యగ్రంథముగ స్వీకరించుట పరీక్షకులకు పరమ ధర్మమని నమ్ముచున్నాఁడను.

మెయిన్ రోడ్,
రాజమండ్రి.
16-5-51.

మహా మహోపాధ్యాయ, కవిరాజ, కవి
సార్వభౌమ, మదరాసు రాష్ట్ర
ప్రభుత్వాస్థాన కవి,
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి,



# పండితాభిప్రాయములు.



From:-
**Vidwan V. Venkatadri Sarma,**
Senior Lecturer in Telugu,
&
Chairman,
Bord of Studies in Telugu,
Univercity of **MYSORE.**

Maharani's College for Women,

*Bangalore. 7-5-1951.*

శ్రీమాన్ సాహిత్య శిరోమణి, ఉభయభాషా ప్రవీణ పండిత కాండూరి నరసింహాచార్య విరచితమగు నీమోహన విజయమును సాంతముగఁ బఠించితి. శైలిధారాళము, కవిత్వము సరసము, భాషస లక్షణము. కాని, రేడియో, రోజులు, రైలు, ట్రెయిను, టెండరు, ఎలెక్షను, ఓటు, ఛేర్మెను క్రాసువర్డు ఫజుల్, ఇత్యాది పరభాషనుండి తెచ్చిపెట్టిన పదములు గలవు. కారణమా? కవిత్వము కాలాను సరణము. చక్కని లోకోక్తు లిందుఁ గలవు. అర్థాంతర న్యాసాలంకారము లీకవిత కలంకారములై యొప్పారెడు. సూర్యోదయ హిమశైల భరతఖండాది వర్ణనము లిందుఁగలవు.

కథా విషయమా! విశ్వపతి యయ్యెఁ బరమలోభి. లోభి

యెన్ని పోకడలఁ బోవునో కన్నులఁ గట్టినట్లు వర్ణితము. ఈతని కుల కాంత వసుంధర, పరమ పతివ్రత సుశీల. ఈదంపతుల పుత్త్రుఁడే కథా నాయకుఁడగు మోహనుండు. ఈతఁడు సర్వవిధములఁ దల్లి చాయ గల పుత్త్రుఁడు. కావున ధన్యుఁడే. జనకుని లోభాది గుణము లీతనికి నచ్చవాయె-కాశీకిఁబోయె. సద్గురువుల నాశ్రయించె. సకల విద్యా పారంగతుఁడై పట్టభద్రుఁడాయె. దేశాటనముం గావించె. పుస్తకలోక జ్ఞానవంతుఁడై నదిట్ట. అహింసా సత్యధర్మ పరాయణుఁడాయె. లోక సేవయె లోకేశ సేవయని నిశ్చయించె. సుశీలం బరిణయంబాయె. ప్రజానాయకుఁడయ్యు దేశద్రోహిగాక లంచగొండిగాక రామరాజ్య స్థాపనమును స్థాపించె. సుస్థిరయశస్సుం గడించె. ఆదర్శ ప్రజానాయ కులకు మార్గదర్శియాయె.

ఇయ్యది వస్తువు కల్పితమే. కాని కాల ప్రవాహమునఁ బడి దొరలుచున్న యితివృత్తమే. ప్రకృతి వైచిత్ర్యమునఁగల విషయము కవితాదర్పణమునఁ బ్రతి ఫలింపఁజేసి లోకమును జక్కని మార్గమున నడిపించుటయ కవిధర్మముగదా? ఇట్టి నీతిబోధక కావ్యముల రచి యించి కవిగారు లోకోప కారులగుదురని నమ్ముచున్నాఁడ.

బెంగుళూరు,
7-5-1951.

ఇట్లు,
వెల్లలూరు వేంకటాద్రి శర్మ,

సాహిత్యరత్న, విద్యాప్రవీణ, విద్వాన్,

# తి. కం. తిరువేంగడాచార్యులు,

ప్రకాశక మంత్రి,

సంస్కృత భాషా పరిచారిణీసభ,

చిత్తూరు 7—5—1951

శ్రీమాన్ శిరోమణి, ఉభయభాషా ప్రవీణ కాండూరు నరసింహాచార్యులవారు రచించిన మోహన విజయమును ఆమూలాగ్రముగఁ బఠించితిని. ఇది సద్భావవిరాజి సాంఘిక ప్రబంధము గాన నపూర్వ భావలలితమై ప్రకృతకాలపు సన్నివేశములు, సాంఘికాచారములు, సమయములు, వ్యావహారిక పదములు మొదలగు వానితో నొప్పారుచు నింపును సొంపును గూర్చుచున్నది. ఈ పొత్తమును జేపట్టినవారికి 'అహోఽపిన రోచతే' అన్నట్లు తనివి సనదు. కవిగారు తీర్చిదిద్దిన మోహనుని శీలము పఠితలకాహా పుట్టించును. విశ్వపతి లోభపరాకాష్ఠయు, వసుంధరయొక్క పెంపును, చక్కఁగఁ బోషింపఁబడినవి. మోహనుని విద్యాదీక్షయు, దేశసంచార రసికతయు, కష్టసహనచాతురియు, ప్రజారక్షణ తత్పరతయు, ధర్మనిష్ఠయు ననమానములు. ఇతఁడు పరమలోభియగు తనతండ్రి నొక్కమాటలో సన్మార్గమునకు మరలించిన బోధకాగ్రేసరుఁడు. ఇతఁడు మన దేశనాయకుల కాదర్శ ప్రాయుఁడుగ నుండఁదగినవాఁడు.

కవిగారు విషయమును సాంఘికమైన దానిని స్వీకరించి

ప్రబంధమున కుండవలసిన వర్ణనలు పోకడలును ప్రాఁతవియుఁ గ్రొత్తవియును సమకూర్చి యీ కృతిసాంఘిక ప్రబంధముగ నొనర్చిరి. ప్రాచీనకవుల పోకడలు రచించు పట్టులందు వారి పద్యములకు ఛాయలనఁదగు పద్యములను గూర్చిరి. అసంఖ్యాకములగు జాతీయములను, సామెతలను, సందర్భానుసారముగ నతుకు తెలియకుండ నీ ప్రబంధమునఁ జూపించిరి. కవిత్వము సరళమై ధారా శుద్ధిగలిగి ద్రాక్షా పాకయుతమై చవులూరించు చున్నది. విశ్వపతియందు హాస్యము, వసుంధరయందు ధర్మ వీరమును, సుశీలయెడ శృంగారమును, మోహనుని విషయమున వీర శృంగారాద్భుతములు నిట్లు వివిధరస సమ్మేళన మీ ప్రబంధమునకు వన్నె దెచ్చినది. ఇందలి శుకదౌత్యము ప్రభావతీ ప్రద్యుమ్నమును దలపించుచున్నది. నగరస్త్రోద్యాన సూర్యోదయాది ప్రాచీన వర్ణనలిందున్నను నవీనావిష్కారముగల విద్యుద్దీపాది విచిత్రవస్తు సంకలితములై యవి యపూర్వ సహజ సౌందర్యమును గనులకుగట్టు నట్లొనర్చుచున్నవి. కవిగారు ఈ ప్రబంధము ద్వారా రామరాజ్య పరిస్థితులు భారత రాజ్యమునందుఁ గల్గింప నుద్బోధించుటకై సంకల్పించినట్లుల దోఁచుచున్నది. కావననే వీరు తృతీయాశ్వాసము 112 పద్యమున

ఉ॥ "మోహములేని పండితులు మోసములేని కులాంగనల్ మదిం
ద్రోహములేని పౌరులును దోరపు ధర్మ సమృద్ధి గల్గన
వ్యాహత దీక్షమైఁ బ్రజల నారయఁ గంటిని ఱెప్పవోలె న
మ్మోహను ధర్మ పాలనము ముజ్జగముల్ నుతియింపకుండునే"

అని చెప్పియున్నారు

ఉన్నతా దర్శములనలవరచుకొనవలసిన విద్యార్థులకిది పాఠ్యముగాఁ నవశ్యముంచఁ దగినది యనియు సకలప్రజలును దీనిఁ బఠించి తమకుఁ దగిన నాయకుని నెన్నుకొనఁగల నైతిక శక్తిని సంపాదింప వలయుననియును గోరుచున్నాను

ఇట్లు

టి. కం. తిరువేంగడాచార్యులు,

ఆంధ్ర పండితులు,

కస్బన్ హైస్కూలు,

చిత్తూరు 7—5—1951



జటావల్లభుల పురుషోత్తము, ఎం. ఏ.,
Sanskrit Lecturer,
S. R. R. & C. V. R. Colleg
విజయవాడ 16—6—51.

శ్రీ కాందూరు నరసింహాచార్యులవారికి.

జటావల్లభుల పురుషోత్తము నమస్కరించి వ్రాయునది:—

మీ 'మోహన విజయము'ను శ్రీ దేవరభొట్ల వేంకట సుబ్రహ్మణ్యశర్మ వలనఁ బొంది యామూల చూడము నేకధారగాఁ గ్రోలితిని. శబ్దసౌష్ఠవము, ఔచితి, భావబంధురత, ప్రయోగ నైపుణి, పాత్రపోషణ, కథానుసంధానము, అహమహమికతో నలరారుచున్నది.

మీరు వాడిన లోకోక్తులు జాతీయ ప్రయోగములు ఆంధ్ర భాష నైసర్గిక మాధుర్యమునకు మచ్చుతునుకలుగా నున్నవి. మానవ కల్యాణ మార్గమును కాంతా సమ్మితముగా బోధించుట కావ్య ప్రయోజనమని యాలంకారికులు నిర్ణయించినదానికి మీ కావ్యము లక్ష్యభూతము. మోహనుని గుణశీల చారిత్రములను బరిశీలించిన వారికిది తెల్లము కాఁగలదు. మీ 'విశ్వపతి' నిగమ శర్మాదులవలె కావ్య ప్రపంచములో ప్రజలనోళ్లలో చిరకాలము మెలఁగఁ గలఁడు.

విశ్వపతి యకస్మాత్తుగ ఉల్లాసము గనఁబఱచుట భార్య దానినిజూచి భ్రమించుట. తుదకాతఁడు "పరఁగ క్రాస్‌వర్డ్ పజిల్ వేసి

పాటువడితి" యున్నగు మాటలలో సత్యమును వెల్లడించుట యున్నగు వానిలోని పాత్రపోషణములో మీ చాతురి ప్రతి ఫలించు చున్నది. నేను పైని చూపిన మీ గ్రంథమందలి గుణవిశేషముల కన్నిటికిని ఉదాహరణములు చూపవలయునను కౌతుకము గల్గుచున్నది. కాని గ్రంథ విస్తర భీతిచే విరమించు చున్నాను.

మీ లేఖిని నుండి యెంత గ్రంథ జాతము వెలువడిన ఆంధ్ర భాషా యోషకంత భూషా సంపాదనము కాఁగలదని విశ్వాసము.

ఇట్లు,
జటావల్లభుల పురుషోత్తము.
16—6—51.

శ్రీ

1135 కృష్ణమూర్తి పురం,
మైసూరు, 5-5-51.

బ్రహ్మశ్రీ కాండూరి నరసింహాచార్యులవారి సన్నిధికి.

రాళ్లపల్లి అనంత కృష్ణశర్మవి అనేక ప్రణామములు.

మహాశయా! తమ మోహన విజయము, అందలి జాబును అందినవి. ఇట్లు పంపుట యందు నాయెడఁ జూపిన యాదర గౌరవములచే ధన్యోస్మి.

మీకావ్యము నామూల చూడముగఁ జదివితిని. తమ కావ్య ధార చాల లలితమైనది. పద్ధతి ప్రాచీనమై విషయము అర్వాచీన మైనను నడక కుంటులేక యున్నది.

భవదీయుఁడు,
రా. అనంత కృష్ణ శర్మ,

# విజ్ఞప్తి.

రామచంద్రుని లీల లద్భుతంబులు. అవాఙ్మానస గోచరములు. సృష్టి కడువిచిత్రము. అది కనుంగొనలేక లోకము పోకడలు పలు తెఱంగులు.

నా చరిత్రము పూర్తిగ వ్రాయవలయు నన్నచో నది యొక పెద్ద గ్రంథమగును. నా తండ్రి రాఘవాచార్యులు, భారద్వాజ గోత్ర పవిత్రుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. బడిపంతులు, నిరుపేద నాయాఱవయేట నన్నెడఁబాసి పరమ పదంబున కరిగె. నేను రెండవ కుమారుఁడను. అనంతరము పసిబిడ్డలను సంరక్షించు భారము నాతల్లి తిరువేంగడాంబపైఁ బడెను. భిక్షాటనముచే జీవయాత్రగడచుచుండెను.

చిన్ననాఁడు నేను కల్లమున నొక మూలఁగూర్చుండి యుండ నైజాము ఇలాకా గోపాలుపేట సంస్థానము నందలి జగతిపల్లె గ్రామ కరణము శ్రీ శ్రీ కీ॥ శే॥ వేంకటరావుగారి నోట "పెద్దవానివలె చిన్నవాఁడును చదువులేక చెడిపోయె" నని పలికించి నన్నుఁ జదువునకుఁ బ్రోత్సహించినది శ్రీరామ చంద్రుని లీలయే యని నా విశ్వాసము. అప్పటికి నాకుఁ బదునాలుగవ యేడు జరుగుచుండెను.

ఉద్రేక ముప్పొంగెను. ప్రొద్దుటూరు, మదరాసు, మైసూరు, బెంగళూరు నగరములలో పండ్రెండు సంవత్సరము లెన్ని యాటంకము లెదుర్కొన్నను విద్యాభ్యాసము నిర్విఘ్నముగా సాగెను. అందుకుఁ

దోడ్పడిన పెదతల్లి కుమారుఁడు కీ॥ శే॥ శ్రీమాన్ రాళ్లబండి వేంక టాచార్యులును, బావగారగు కీ॥ శే॥ శ్రీమాన్ కందాళ నరసింహా చార్యులును, కీ॥ శే॥ శ్రీమాన్ ఉప్పల వేంకట నరసింహాచార్యు లును యావజ్జీవము స్మరణీయులు. అందఱికన్నను నన్ను వలె నొందఱినో యభిమానించి యాదరించి దఱిఁజేర్చి యుద్ధరించి యకాలమున కన్న పూర్ణ యనిపించు కోఁగలిగిన పెదతల్లి కూఁతురు కందాళ వేంకట నరసమ్మగారి యౌదార్యము యావజ్జీవము మరువరానిది. వీరి కందఱికి సదా కృతజ్ఞుఁడను.

1926వ సం॥రము నుండి నేఁటి వఱ కాంధ్రభాషా ధ్యాప కుఁడనై యథాశక్తి సారస్వత సేవఁ జేయుచున్న నాకు నేఁబది యేండ్లు దాటినవి. రంగధామ శతకమును, కావ్య ప్రకాశ వివరణ మును (ప్రథమభాగమును) ప్రచురించియుఁ బ్రోత్సాహములేని కార ణముచేతను, సాంసారిక పరిస్థితులచేతను నుపేక్షాపరుఁడనై కాలముఁ గడపుచున్న నన్ను నాకస్మికముగఁ గవితామార్గమున నడుగులు వేయించుటకు శ్రీరామచంద్రుని కృపాకటాక్షమే హేతువనక తప్పదు. దుర్భర జీవిత యాత్రాసమయమున నిది యొక విశ్రాంతి సాధనముగాఁ గల్పించెనేమొ.

సాధారణముగఁ బ్రాపంచిక పరిణామముల విమర్శించు కొనుట నా యలవాటు, కనుకనే నేనిట్టి గాథను కల్పించుకొంటిని. ఇది యొక యుత్తమ మార్గా దర్శకమనుటలో విజ్ఞులు నాకుఁ జేయూత నొసంగె దరని భావించెదను. నా కావ్యమును విమర్శించు తలంపుగల మిత్రులు పలువురుండవచ్చును. నాదృష్టి వేఱు, వారిదృష్టి వేఱు, గాని ప్రజా

సామాన్యమును దృష్టి యందుంచు కొనువో వారును నాతో నేకీ భవింతురనియే నానమ్మకము. ఉద్దేశము కవియధీనము. సందేశము ప్రధానము, ప్రౌఢత యేకదేశాన్వయి. భావము స్వతంత్రము-భాష కాలపరిణతము, ప్రాంతేదనము పట్టుదల. శాసనములు మార్గ దర్శకములు

గుణ గ్రహణ పారీణులగు విద్వాంసులును, కవి వతంసులును నాయల్పకృషికి దోహదమొసంగి పెంపొందఁ జేయుదురని నాప్రార్థన. అంతయు రామునికృప. విశ్వసించువారికి రామరాజ్యము పెంపొందు ననియే దృఢ నిశ్చయము

భార్య గ్రుడ్డిది. బిడ్డలు పసివారు. బడిపంతులపని. కాలము కటువు. చాలి చాలని యన్నము. ఇట్టి క్లిష్టపరిస్థితులలోఁ గార్యాంత రాసక్తుండనై చక్కఁగాఁ బరీక్షింపని కారణముచేఁ బ్రమాదవశమున గ్రంథమునం దక్కడక్కడఁ గొన్ని దోసంగులు పొసఁగి యున్నవి. సవరణ పట్టిక ననుగ్రహింపుఁడు. రెండవ ముద్రణమున నన్నియు జక్కఁబడునని విశ్వసింతు. విజ్ఞులు ప్రమాదమును క్షమింతురుగాక.

"కాళిదాస మయూరాది కవులకైనఁ
గలవు తప్పుల నంగ నన్యులకు లేవె?
దిద్దఁ దగుపట్ల దిద్దుఁడు దిద్దరాని
యెడల నానేరములు క్షమియించుటొప్పు" (అప్పకవి)

నాయందవ్యాజ ప్రేమచేఁ బుస్తకమును సంస్కరించి యవ

తారిక వ్రాసి యిచ్చినందులకు శ్రీ, శ్రీ, కవిరాజ, కవిసార్వభౌమ మహా మహోపాధ్యాయ, మదరాసు రాష్ట్ర ప్రభుత్వాస్థానకవి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారికి, నా మనః పూర్వక కృతజ్ఞతలు తెలుపుకొను చున్నాను. అడిగిన వెంటనే యాదర పూర్వకముగ నభి ప్రాయము లనుగ్రహించిన పండిత వరులకు నా కృతజ్ఞతలు

అడిగిన తోడనే పుస్తకము నచ్చొత్తించుటకుఁ దగిన ధన సహాయముచేసి ప్రోత్సహించిన నా శిష్య వర్గమునకును, జమ్మలమ డుగు పౌరవరులకును, సహోదరునివలె నాకండగా నిలిచి ప్రోత్సా హకుఁడై యీకృతి వెలువరింపఁ దోడ్పడిన మా స్కూల్ జూని యర్ పండితులు శ్రీశ్రీ డి. వి. యస్. శర్మగారికిని, యట్టి యితర మిత్రులకును నామనః పూర్వకాభినందనములు దెలుపుకొను చున్నాను

పి. అర్. బోర్డు హైస్కూలు,
జమ్మలమడుగు

ఇట్లు విన్నవించు,
కాండూరు నరసింహాచార్యులు,
20—6—1951

# సవరణ పట్టిక.



| పుట. | పంక్తి. | తప్పు. | సవరణ |
|---|---|---|---|
| 3 | 6 | ప్రగాఢ | గాఢ |
| 6 | 2 | కల్పనలు | కల్పన |
| 7 | 16 | శ్లాఘ్యమై | నుత్యమై |
| 8 | 13 | పగిదిని | పద్ధతి |
| 9 | 10 | గడుపు | గడపు |
| ,, | 13 | పొగడపున్నాగముల | పొగడఁబున్నాగమును |
| ,, | 21 | సీతామతల్లి | జానకీతరుణి |
| 11 | 9 | హుళక్కయ్యె | హుళక్కైపోయె |
| 14 | 11 | నయారె | జనంబు |
| 19 | 7 | చనువు | చనవు |
| 20 | 14 | గడుపక | గడపక |
| 21 | 8 | గడుపు | గడపు |
| ,, | 10 | మోహనకరుండగు | మోహానుండగు |
| ,, | 22 | నెచటకేగు | నెచటికేగు |
| 23 | 1 | నవమాసములు | నవమాసమ్ములు |
| ,, | 2 | దాపురింప | డగ్గరింప |
| 25 | 9 | ఒక్కదింబు | ఒక్కదినంబు |
| ,, | 19 | నొప్పగించు | నొప్పగించు |

| | | | |
|---|---|---|---|
| ,, | 17 | ఆర్యవచనమ్ము | ఆర్యసూక్తి |
| 31 | 6 | పురుషార్థములుభూరి శాఖలునుగ | సత్పురషార్థముల్ శాఖలునుగ |
| 31 | 19 | దెలసి | దెలిసి |
| 32 | 5-6 | సప్తవ్యసనముల | నేడు వెసనముల |
| 38 | 22 | (సవరణ) ఊం మఱివచ్చును లెండుపొండనక | |
| 33 | 8 | ద్రిప్పి | ద్రిప్పి త్రిప్పి |
| 39 | 20 | కాసి | కాశి |
| ,, | 12 | డయ్యెడక | డయ్యెడుక |
| ,, | 21-22 | (సవరణ) శ్లో శ్రేయోదాయకములు | సశ్రీకములగు |
| 50 | 9 | బనరఁగ | ఒనరఁగ |
| 51 | 2 | వేలిమి | మేలగు |
| ,, | 17 | పెన్నలలర | పెన్నయలర |
| 53 | 19 | హిమవ్నగంబు | హిమవన్నగంబు |
| 54 | 15 | పుడిమి | పుడమి |
| 55 | 5 | మాపురి | నాపురి |
| ,, | 18 | సంతుష్ట | ప్రముదిత |
| 56 | 15 | స్త్రైవ్ల | స్త్రైల్ల |
| 58 | 7 | యుంటివి | యుంటివ |
| 62 | 20 | బ్రతిమాలి | బతిమాలి |
| 64 | 9 | రోగిఁగుచూపి | రోగకృశాంగి |
| ,, | 14 | నశ్చింత | నిశ్చింత |

| | | | |
|---|---|---|---|
| 68 | 18 | సుశీల మోహానుల | సుశీల కవ్వరునకా |
| 72 | 9 | సిమలన్ | సీమలన్ |
| ,, | 11 | హెన్చ్చుగ | హెచ్చ్చుగ |
| ,, | 17 | పోల్చెడిన్ | పొల్చెడిన్ |
| 73 | 14-15 | విద్యున్మాల భంగిన్ సమస్తో | విద్యుత్తరంగంబు నాను |
| ,, | 21 | వెఱయ | మెఱయ |
| 74 | 3 | లై వధువు | లమ్మగువ |
| 75 | 16 | బనాతలయంబు | బతనాలయంబు |
| 80 | 10 | కనకట్టు | కనుకట్టు |
| 85 | 21 | సాంఘిత | సాంఘిక |
| 91 | 12 | నిట్టవగు | నిట్టివగు |
| 92 | 11 | మేట | మేటి |

# విషయ సూచిక.

పుట.


| | | |
|---|---|---|
| 1. | ధర్మపుర వర్ణనము | 3 |
| 2. | ఉద్యాన వర్ణనము | 6 |
| 3. | విశ్వపతి వర్ణనము | 8 |
| 4. | వసుంధరా విచారము | 11 |
| 5. | శంకరుని యుపన్యాసము | 29 |
| 6. | సూర్యోదయ వర్ణనము | 38 |
| 7. | మోహనుఁడు విద్యాభ్యాసమున కరుగుట | 39 |
| 8. | మోహనుని విద్యాభ్యాస క్రమము | 41 |
| 9. | మోహనుని దేశసంచారము | 43 |
| 10. | మోహన సుశీలల చెలిమి | 44 |
| 11. | హిమాలయ వర్ణనము | 46 |
| 12. | సముద్రవర్ణనము | 54 |
| 13. | విశ్వపతి మోహనుల సంభాషణము | 58 |
| 14. | వసంత వర్ణనము | 71 |
| 15. | మోహనుని వివాహ ప్రయత్నములు | 73 |
| 16. | మోహనుని దేశసేవ | 76 |
| 17. | నెచ్చెలులు బలాత్కరించి మోహనుని యెన్నికలకు నిలుపుట | 80 |
| 18. | మోహనుఁడు చేర్మనయి పురమును పాలించుట | 83 |
| 19. | మోహనుఁడు రాష్ట్రపు టెన్నికలకై ప్రచారము చేయుట | 88 |
| 20. | మోహనుని రాష్ట్ర పరిపాలనము | 91 |

—◆ శ్రీరామ చంద్ర పరబ్రహ్మణేనమః ◆—

శ్రీ

# ★ మోహాన విజయము. ★

## (సాంఘిక ప్రబంధము.)

—: ప్రథమా శ్వాసము. :—

—: మంగళా చరణము. :—

శా॥ "సత్యం జ్ఞాన మనన్తమం" చెవని శాస్త్రంబు ల్ప్రశంసించు నా
నిత్యు, న్నిర్మల చిద్విలాసు, సతమున్నిర్లిప్తు, నా ధ్యాత్మిక
మ్మత్యానందము సౌఖ్యముల్దనర నిష్టార్థంబు సంసిద్ధికై
నిత్యం బర్థిని గేలుమోడ్చెదను నే నిర్న్రద భక్తిన్ హృదిన్.

చ॥ పలదని యూరకుంటె బలవంతుల పాలిదె భాగ్యమంచు, నన్
బలిమిని బట్టి ముందునకుఁ బట్టుదలన్నడిపించు రేలకో
లలిత కవిత్వ ప్రాభవ విలాస వికాసములుల్లసిల్ల, స
త్ఫలము లొసంగు పావన కృపానిధి! యెవ్విధి సంతరించెదో.

శా॥ తల్లీ! నిన్నుఁదలంచి వ్రాయఁగలముందాల్తు న్విజృంభించి, నా
యుల్లంబందున మేలిశబ్దములతో నుత్సాహముం శోభిలం
ఫుల్లాంభోరుహనేత్ర! భారతి! ననుంబ్రోవంగఁ బ్రార్థింతు, నీ
యుల్లాసంబునఁగాదె? యీజగము నిత్యోత్సాహతం గ్రాలెడిన్.

తే॥ భారతాంబ స్వతంత్రతా భాగ్యసీమ,
ప్రజల దూషణ భూషణ ప్రకరములకు
భారతీమాత! నీమీఁద భారముంచి
క్రొత్త నడకను రచియింతుఁ బొత్త మొకటి.

తే॥ నడుపు వాఁడల రాముండు నడతునేను
సాధనము గాఁగ సత్కవీశ్వరుల కృపయు,
నన్నయాది కవీంద్రుల సన్నుతించి,
తప్పులున్న క్షమించు నుత్తములఁ దలఁతు.

ఉ॥ భావనిగూఢ బంధ పటు బంధుర కావ్యములేవ, చిత్తసం
భావిత భావ బంధురతఁ బాసినఁ దేలిక మానవాళికిం,
దేవగఁ గూర్పు లిద్ధరణినించు ముదావహమాచు? నెందున
ద్భావ విరాజి సాంఘిక ప్రబంధము లింపును, సొంపుఁ, గూర్పవే

—: కథా ప్రారంభము. :—

శా॥ రంగత్తుంగ తరంగ లాస్యములు తోరంబై చెలంగంగ, వే
నింగి న్వీడి భువి న్విహారములతో నేర్పొద్దగన్మించి, వ్యా
సంగం బూడినసాధు మానసమునోజం సాత్వికప్రాకృతిన్
గంగా వాహిని యొప్పుఁగాదె జగతిన్ గంభీర పుణ్యాకృతిన్

తే॥ ధన్య సుఖ జీవనాయత ధర్మనిలయ
మనఁగఁ దత్తీర భూమియందలరు చూడు
నవ్య విజ్ఞాన సంస్కృతి భవ్యతరము
ధర్మపురమది శ్రీలకుఁ దానలంబు. 2

—: ధర్మపుర వర్ణనము. :—

ఉ॥ గారవమిచ్చు కర్మరతి, ప్రగాఢ పరార్థహిత ప్రవృత్తి, సం
సార సుఖైకరక్తి, ససిసారములేని క్రియావిరక్తి, యే
పారఁగ నిత్యతృప్తి, సమతాప్తి సమస్తజనౌఘ సంగతిన్
బూరుషులందు నింపెసఁగుఁ, బూజ్యగుణావళి యప్పురంబునన్ 3

ఉ॥ ఎంతయు నేర్పులందనరి, యేచుగౌనంబుల నుల్లసిల్లి, స
చ్చింతయ సంతతంబడరఁ జిందఱ వందఱ లేని ప్రేముడిన్
గాంతులఁ గూర్చి, పేర్చి, తమగారవ మెల్లెడఁ బ్రాఁకి పర్వఁగాఁ
గాంతలు వెల్గుచుండ్రు, గృహకాంతులు నల్గడ నందగింపఁగన్ 4

ఉ॥ అందఱు కర్మనిత్యరతు, లందఱు విద్దెలనేర్చు వార, లిం
పొందఁగ నైకమత్యమున నుందురు ధర్మపురీనివాసు, లం
దందఱియందుఁ గాన నగు నార్యగుణమ్ములె కాని, భేదముల్
మందునకైనఁ గొందమని మానస వీథులఁ గాంచఁ గందుమే 5

ఉ॥ యోగ్యత విద్యలందున, ప్రయోగములంద విశేషమాన్యతల్,
భాగ్యములంద గౌరవము, ప్రాజ్ఞులయంద విశిష్టబుద్ధి, సం
భోగ్యత స్వార్జితంబునన, పూజ్యత దేశహితైక వృత్తి, వై
రాగ్యము స్వార్థమంద, పురరాజము ధర్మపురంబునందునన్ 6

ఉ॥ కర్షక లోకసేవితము, కార్మిక సంస్థల కాలవాల, ము
త్కర్షమున న్వెలుంగు బుధధామము, సజ్జన పూజితంబు, నా
కర్షక చిత్రశోభితము కాయిక కర్మల కాకరంబు, ని
ష్కర్షగ సత్త్వమం బనఁగ స్తవ్యము ధర్మపురంబు శోభిలున్ 7

చ॥ కలఁతలు లేవ యెన్నఁడును గార్మిక సంస్థల భృత్యవృద్ధికై
యలుకలు లేవ యెన్నికలయందుఁ బరాత్త జయోపలబ్ధికై
చలనములు లేవ డెందములఁ జాలని జీతము పెంపు సేఁతకై
యిలను సుభిక్షమై యెసఁగు నిప్పురి నెప్పుడు నిండు సంపదన్ 8

క॥ అలసత యంత్రవ్యాప్తుల
బలముగఁ బనికలుగకుంట వైద్యులయందున్
ములయు వకీలుల యందే
సలలితముగు ధర్మపురి నిజంబయి యొప్పున్ 9

ఉ॥ అక్కజమైన వీధులను నంచిత నిర్మల దర్పణమ్ములం
జక్కఁగఁగానుపించు పురసౌధపుటుజ్జ్వల మూర్తులొప్పఁగన్
జక్కని భూజపంక్తి దగు సారున నిల్చిన యోధపంక్తి గాఁ
జిక్కని యప్పురంబొదవుఁ జివ్వకు సౌరపురంబుఁ జీరునాన్ 10

సీ॥ వివిధ విజ్ఞాన వివేకముల్ దనరంగఁ
బరఁగ నోజ్జలు దేవగురుని మించ
వ్యాస వాల్మీక్యాది వాక్చమత్కృతిఁ గేరు
రచనా మించు సత్కవి రాజి యొప్ప
వాణి విద్యలరాణిఁ బ్రేణిసేయఁగఁజాలు
నరసగాయక తతి వరలు చుండ

బుధవరుల్మది మెచ్చు బుద్ధిబలంబునఁ
బూర్ణ ప్రక్రియనించు బుధులు గలుగ

తే॥ సకల కళలును సినిమాలు సందడింప
ధరణి దిగినట్టి యల సుర పురమునాఁగ
నిత్యకల్యాణమై యొప్పు నిండు సిరుల
ధర్మ పుర మది యెన్నఁగఁ దఱమె చులుక 11

మ॥ సుర గంగాతటినీ సుధారసముచేఁ జొక్కంబులై పొంగు భా
సుర భూసారము లెంతయేఁ బెరుగఁగా నుంతైన ఖేదింపకా
పుర రాజంబున కంటు భూములను సంపూర్ణంబులై మించగాఁ
బరఁగన్ రైతులు మేలిపంటలు దగంబండింత్రు ముక్తాఫలల్ 12

ఉ॥ మింతురు పౌర శిల్పులను, మిన్నుల నంటు గృహవ్రజంబు ని
ర్మింతురు నూత్న పద్ధతిని, మేలి సభా భవనంపుఁ గోటఁగా
పింతు రధః కరింత్రు మయు వీఁక నతండన నెంతయంచు, రా
ణింతురు శిల్పులప్పురిని, నేరిమి మీఱఁగఁ బ్రాజ్ఞ కోటిలోన్ 13

ఉ॥ విందురు విన్నపంబులను వేసరికల్మదిఁ దోఁపనీక, యే
మందురు మోముఁ జూడఁగనె యందఱ నాదర పూర్వకంబుగా,
నందురు కార్యతత్పరత నోపిక లెంతయు నుల్ల సిల్లఁగా
నందుఁ బ్రభుత్వ శాఖలను నార్యులు మెచ్చఁగ సేవకుల్దగన్ 14

ఉ॥ నింగి విమానముల్ దిరుగు నేర్పులు చక్కఁగఁ జూచు వారికిన్
సంగడి కాఁడు లచ్చిమికి, సాధు జనావళిఁ బ్రోచువాఁడు వే
గంగ వియచ్చరావళిని వేఁగులు చూడఁగఁ బంప, నేరిమిన్
దొంగల దుష్టులన్వెదకు ధోరణి తోఁచెడిఁ జూడనప్పురిన్ 15

ఉ॥ తెన్నుఁ బ్రయాణముల్ విసుఁగు లేశముఁ జెందక పోయినొంద,సం
తన్ను విశాల కల్పాలు ముఖంబును గూర్చఁగ, సేదఁ దీర్చఁగన్
బున్నన మోహాఁగుచున్ సతము పుట్టుచు వ్రీలిన పోల్కినప్పుడెన్
బన్నులు రైలుబండ్లు పలుమాఱులు వచ్చుచుఁబోవుచుండెడిన్ 16

—: ఉద్యాన వర్ణనము. :—

ఉ॥ ఒప్పుగ నొక్కచోట లలితోప వనంబలరారు నప్పుడెన్
జొప్పడ మేలివృక్షములు, వొక్కపుఁ దీవలు, పుష్పగుచ్ఛముల్,
కుప్పలు కుప్పలై లలిత కూజిత రాజిత పక్షిజాలముల్,
చప్పున శ్రాంతిఁ దీర్చుటకు జాణ విరించి సృజించెనోయనన్ 17

క॥ పొందుగ నడరెడు ప్రహరులు
నందములగు మార్గతతులు, నలరు కుజములున్
విందులు గొలుపుచు గనులకు
నందలి యుద్యాన వనమునందుఁ దలిర్పన్ 18

తే॥ నడుమ జలయంత్ర, మద్దాని కెడమవైపు
ప్రకట వృత్తాంత పత్రికా పఠన గృహము,
సరస నొక్కెడ బహిరంగ సభకుఁ దావు
దాని ప్రక్కన రేడియో తనరుచుండు. 19

సీ॥ పట్టు తివాసీలు పఱచిన వడువునఁ
బచ్చిక పఱపుల పసఁదనంబు
తెరువుల కిరువైపు తీర్చి దిద్దిన కత్త
రింపు నికుంజ పుంజంపు సొబగు,

పద్మదళాకృతిఁ బరఁగు దారులు వాని
దరిని గూర్చుండుట కరుగు గమియు,
నందందు నిరవొందు పొందికట్టగ మించు
పూల పందిళ్లు నాఁ బొదలు పొదలు,

తే॥ గలిగి యుపవన మయ్యెడ వెలయుచుండు
నంగజుఁడు వేడ్క విహరింప నడరు వనమొ,
వేల్పుటింతులు క్రీడింప వెలయు వనమొ,
యనఁగ మానోజ్ఞకంబున నతిశయిల్లి. 20

క॥ పచ్చిక పఱపులఁ గొందఱు,
నచ్చిక మఱి కొందఱచటి నళినీస్థలిపై
ముచ్చట లాడుచు నుందురు
మచ్చికఁ బ్రతి దినము సంజ మాపులయందున్ 21

ఉ॥ కొందఱు శాస్త్రవాదముల, గొందఱు సాంఘిక ధర్మతత్త్వముల్,
కొందఱు రాజకీయములఁ, గొందఱు కావ్య కళాచమత్కృతుల్
కొందఱు కాలమానములఁ గూర్చి విచారము సేయు సంబరం
బందముఁగూర్చుఁ జూపరుల కందలి సొంపుచిలింప శ్లాఘ్యమై 22

ఉ॥ ఝుమ్మగ రేడియోలచట నేర్తెఱ మోహన లీలఁ బాడఁగాఁ
గమ్మని పుష్పగుచ్ఛములఁ గ్రమ్మి మనోహర సుస్వరంబులన్
ఝుమ్మను రాగమాలికల సొంపున మ్రోఁగు విధంబుఁ జూడఁగాఁ
దుమ్మెద లెల్లవేళలను దోఁచును గీతులు వల్లెవేయునాన్. 23

చ॥ సరిగ వసంత వేళనట సమ్మతిఁ గోయిల గున్నమామిడిన్
స్థిరముగఁ గూరుచుండి, విని దీటుగ రేడియొ పాడుపట్టులన్

ఉ॥ తెన్నఁ బ్రయాణముల్ విసుఁగు లేశముఁ జెందక హాయినొంద,నం
తన్ను విశాల కల్పాలు ముఖంబును గూర్పఁగ, నేదఁ దీర్పఁగన్
బున్నవి మోఁగుచున్ సతము పుట్టును బ్రీలిన పోల్కినప్పరిన్
బస్సులు రైలుబండ్లు పలుమారులు వచ్చుచుఁబోవుచుండెడిన్ 16

—: ఉద్యాన వర్ణనము. :—

ఉ॥ ఒప్పుగ నొక్కచోట లలితోప వనంబలరారు నప్పురిన్
జొప్పడ మేలివృక్షములు, వొక్కపుఁ దీవలు, పుష్పగుచ్ఛముల్,
కుప్పలు కుప్పలై లలిత కూజిత రాజిత పక్షిజాలముల్,
చప్పున శ్రాంతిఁ దీర్చుటకు జాణ విరించి సృజించెనోయనన్ 17

క॥ పొందుగ నడరెడు ప్రహరులు
నందములగు మార్గతతులు, నలరు కుజములున్
విందులు గొలుపుచు గనులకు
నందలి యుద్యాన వనమునందుఁ దలిర్పన్ 18

తే॥ నడుమ జలయంత్ర, మద్దాని కెడమువైపు
ప్రకట వృత్తాంత పత్రికా పఠన గృహము,
సరస నొక్కెడ బహిరంగ సభకుఁ దావు
దాని ప్రక్కన రేడియో తనరుచుండు. 19

సీ॥ పట్టు తివాసీలు పఱచిన వసువునఁ
బచ్చిక పఱపుల పసఁదనంబు
తెరువుల కిరువైపు తీర్చి దిద్దిన కత్త
రింపు నికుంజ పుంజంపు సొబగు,

పద్మదళాకృతిఁ బరఁగు దారులు వాని
దరిని గూర్చుండుట కరుగు గమియు,
నందంపు నిరవొందు పొందికల్లగ మించు
పూల పందిళ్లు నాఁ బొదలు పొదలు,
తే॥ గలిగి యుపవన మయ్యెడ వెలయుచుండు
నంగ జుఁడు వేడ్క విహరింప నడరు వనమొ,
వేల్పుటింతులు క్రీడింప వెలయు వనమొ,
యనఁగ మానోజ్ఞకంబున నతిశయిల్లి. 20

క॥ పచ్చిక పఱపులఁ గొందఱు,
నచ్చిక మఱి కొందఱచటి నళినీస్థలిపై
ముచ్చట లాడుచు నుందురు
మచ్చికఁ బ్రతి దినము సంజ మాపులయందున్. 21

ఉ॥ కొందఱు శాస్త్రవాదముల, గొందఱు సాంఘిక ధర్మతత్త్వముల్,
కొందఱు రాజకీయములఁ, గొందఱు కావ్య కళాచమత్కృతుల్
కొందఱు కాలమానములఁ గూర్చి విచారము సేయు సంబరం
బందముఁగూర్చుఁ జూపరుల కందఱి సొంపునిలింప శ్లాఘ్యమై 22

ఉ॥ ఇమ్ముగ రేడియోలచట నేడ్తెఱ మోహన లీలఁ బాడఁగాఁ
గమ్మని పుష్పగుచ్ఛములఁ గ్రమ్మి మనోహర సుస్వరంబులన్
ఝుమ్మను రాగమాలికల సొంపున మ్రోఁగు విధంబుఁ జూడఁగాఁ
దుమ్మెద లెల్లవేళలను దోఁచును గీతులు వల్లెవేయునాన్. 23

చ॥ సరిగ వసంత వేళనట సమ్మతిఁ గోయిల గున్నమామిడిన్
థిరముగఁ గూరుచుండి, విని దీటుగ రేడియొ పాడుపట్టులన్

బిర బిర రంధ్ర వేడ్క మెయి పీనుల వెందుగ వెండురంచు, నా
వరుసఁగుహూంకుహూ యనును బౌరులఁబిల్చెడుకోవియొప్పఁగన్ 24

చ॥ శ్రుతుల తరంగముల్ చెవికి సొంపుఁ దలిర్పఁగఁ బాంధులయ్యెడన్
మతి మఱి నిల్చిపోయనగ మానుగ శేడియొ పాడుచుండఁగన్
వితత మహీ రుహ వళులు వేడ్కలు గూర్పఁగఁ జక్కనిల్చి వి
శ్రుత గతి నొప్పునవ్వనినిఁ జూపఱ డెందము చోద్యమందఁగన్ 25

## —: విశ్వపతి వర్ణనము :—

ఉ॥ ఒప్పఁగ సజ్జన ప్రకర ముల్లసిలన్, దివిజుల్ నుతింపఁగన్
మెప్పు వహించి సంపదల మేల్మి దిగంతవిహారి కీర్తి యా
నప్పురినుండు విశ్వపతియంచొక లుబ్ధుడు దుర్విదగ్ధుడై
చప్పునఁ జందనప్రతతి సందున మొల్చిన తుమ్మచెట్టునాన్. 26

మత్తకోకిల—కొల్లఁగాఁ దన యిల్లు నిండుగఁ గోటి వి త్తములుండినన్
గొల్లఁ బోయిన వాని పగిదిని గోడు మంచుఁదపించెడిన్
డెల్లబియ్యముఁ, బిండివంటలు తిన్న భాగ్యము నోచఁడున్
జిల్లిగవ్వయునేని వీడఁడు చేర్చిప్రార్థన చేసినన్. 27

తే॥ కుడిచి కట్టఁడు, పేదలకిడఁడు, ధర్మ
కార్యముల కేని యీయఁడు కాసునైనఁ,
బెనఁగి కొండంత ధనమున్నఁ బేర్మియేమి?
ధరను సుఖమున్నె లోభికిఁ బరువు గలదె? 28

ఉ॥ ప్రాఁటకు నూకలన్నమును బుచ్చిన జొన్నల రొట్టెలింపుగా
దీటుగమంచి యన్నములు తియ్యనిపండ్లు రుచించు నెట్లు? తాఁ

జేటుగ వడ్డికిన్మఱలఁ జేర్చుచు వడ్డిని లెక్కపెట్టుచున్
గోటిధనాధికుండయినఁ గూటికి నోఁచఁడ, కర్మమెట్టిదో. 29

క॥ ఒల్లఁడు సత్సహవాసము
నొల్లఁడు పలువురను గూడి యుండుట కెపుడున్
జల్లఁగ జాఱఁగఁ జూచును
మెల్లగ నెవరేనిఁ దనసమీపము రాగన్. 30

తే॥ కట్టు పుట్టంబు నిఱుపేద గతినిఁ దెలుపఁ
మోము మొగమోట మిసుమంత లేమిఁ దెలుపఁ
గొంగతపమున కెనయగు కూర్మి యలరఁ
గాలమీరీతి నాతండు గడుపుచుండె. 31

తే॥ ఆతనికి ధర్మపత్నియై యడరుచుండు
సుందరాంగి వసుంధరాసుదతి చతుర
పొగడ పున్నాగములఁ గూడి పోడిమిఁగను
తీవ వేమునఁ బ్రాఁకిన తీరుదోఁప. 32

తే॥ అవ్వసుంధర యేణాక్షి, యళికుల కచ,
సుదతి, పూఁబోఁడి, బింబంపుఁ బెదవిచాన
కంబు కంఠి, లతాబాహ, కమల వదన,
సింహతను మధ్య, రంభోరు, చెలువ యలరు. 33

తే॥ క్షమ వసుంధర, కాంతినిఁ జంద్రరేఖ,
పరఁగ సావిత్రి పతిభక్తి గరిమయందుఁ
దలఁప గుణముల సీతామ తల్లి యనఁగఁ
బొలుచు నసదృశ గుణాలిఁ బుడమిఁ బొగడ. 34

సీ॥ ఇల్లు వాకిలి వీడి యిరుగు పొరుగుల కేగి
ముచ్చటల్ సలుపదు ముద్దు గుమ్మ
యమ్మలక్కలు సేరి యాడి పోఁతల నాడ
నాదరింపదు విన నబ్జవదన.
నిత్య కృత్యముఁ దీర్చి నెమ్మనంబున భక్తిఁ
బతిహితా చరణమ్మె వరలుచింతి,
పొద్దుపోవకయున్న నొద్దికనొకచోటఁ
జక్కని పొత్తముల్ సదువుజాణ. ౩౫

తే॥ ఇంతచక్కని చుక్కయై యొసఁగు కాంత
కరయ వగపొందు విడువక పరఁగుచుండెఁ
దనదు పెనిమిటి లోభియై తనకుమంట
దైవకృతములు తప్పింపఁ దరము లగునె?

తే॥ అకట! యాయింతి యేమి సేయంగఁ గలదు
కుడిచి, కట్టియు, ముడిచియుఁ, గోర్కెమీఱ
భోగ శృంగార డోలిక లూఁగఁ జూచుఁ
గాని లుబ్ధుఁడు పతి, పొందు గలుగు టెట్లు? 36

ఉ॥ భంగము లేని చొప్పున శుభంకర భాగ్యము హెచ్చియుండ, వ్యా
సంగములేక వైభవముఁ జయ్యనఁ గూర్చు విధానముండ, సా
గంగ సహింపఁ డించుక సుఖంబు, వసుంధర భాగ్యమొప్పెడిన్
"అంగడి నన్నియున్న యవి యల్లుని నోటశనైశ్చరుండునాన్" 37

ఉ॥ చిన్నతనంబునుండి తనచిత్తమునం దలపోయు భావముల్
గ్రన్నన మాయమయ్యెఁగద, కంజ దళాక్షి వసుంధరాంబకున్

విన్నఁదనంబు దోఁచె మదివేయి విధంబులఁ జింత చేయుచున్,
గ్రొన్ననవంటి చిత్రములకుం బరువేగద భావ ఘూర్ణలల్. 38

తే॥ చూచి చూచి వసుంధరా సుదతి తుదకు
విసిఁగి మనమునఁ బరిపరి వెతలఁ జెంది
దిక్కుతోఁచక యేకతం బొక్కచోటఁ
బతి ప్రవృత్తికి నిట్టులఁ బరితపించె. 39

—: వసుంధరా విచారము. :—

మ॥ పరఁగన్ మా తలిదండ్రులీ మనువు సంపన్నంబుగా నొప్పునం
చరయం జేసిరిగాని, యిందవి హుళక్కయ్యెఁ గానిమ్ము, నా
తఱమే కర్మఫలంబు తొల్గఁగను, నేఁదానిన్మదిం దల్పఁగా
ని, రయం బొప్పఁగ నొక్క వేదన కడున్నిత్యంబు బాధించెడిన్ 40

ఆ॥ వె॥ మనసు నిలువనీక మఱి మఱి యలయించు
దుఃఖరాశి యెల్లఁ దొలఁగు చుండుఁ
బున్నెములు ఫలించి పొల్చిన వడువునఁ
బుత్రుఁ డొక్కరుండు పుట్టెనేని. 41

క॥ నెట్టిన బయటికి నేఁగఁడు
గట్టిగఁ దన గదియె తనకు గతియని యెంచున్
బట్టిన పట్టు విడఁడు తాఁ
బట్టిన కుందేటికి మూఁడె పాదము లనుచున్ 42

శా॥ పోలం జూడఁడు దేశకాలములనే ప్రొద్దు న్వివాదాత్ముఁడై
శీలంబుం గులగౌరవంబును మహా శ్రీమంతుఁడై కానఁడే,

మూలంబుం గనలేఁడు ముక్తికిఁ దమః పూర్ణంపుఁ జిత్తంబునన్
గూలున్ లుబ్ధుఁడు గోత్ర, నేమెఱుఁగఁడుం గూపస్థమండూకమై 43

సీ॥ కరుణయించుక లేని కాయంబు కాయమే
పరహిత మరయని బ్రదుకు బ్రదుకె
భోగింపఁ గొఱగాని పుట్టువు పుట్టువే
పరువుఁ గాంచఁగ లేని నరుఁడు నరుఁడె,
శివ పూజనము లేని చిత్తంబు చిత్తమే
వలయు పుత్రులు లేని కులము కులమె
ధర్మంబులకుఁ గాని ధనములు ధనములే
పేదలఁ బ్రోవని పేరు పేరె.

తే॥ విశ్వపతి చింత లేకుండ విశ్వపతికి
నేల యీవిపరీతంపుఁ జాలు కలిగె
నేమి సేయుదు నక్కటా! యేదిహితము?
కర్మకుడువక యెవ్వఁడు కడచు వాఁడు? 44

చ॥ అనయము విత్తమందె మతి, యారయ ధార్మిక బుద్ధి లేదహా!
వినఁడు మదీయ వాక్యములు వీనులఁ జొన్పిన జాఱిపోయెడిన్
ఘనుఁడు సుపుత్రుఁడన్నిధినిఁ గాంచని వారికి నిహామేలకో
మొనయఁగ భుక్తిముక్తులకుమూలముపుత్రుఁడు గాఁడె యేరికిన్

ఉ॥ వారక కర్మబద్ధులయి వావిరిఁ గన్గొనలేక పారముం
దూఱుచుఁ దమ్ముఁ దామె మది దోసములెన్నుచు నొక్కరొక్కరిన్
బోరుచునుండు దంపతుల పుణ్యఫలంబనఁ జిన్నికుట్టి సాం
సారిక దుఃఖముం దొలఁచి సంతసమిచ్చు చనంతమై తగన్ 46

క॥ తడఁబడు పదముల నిడుచును
నడయాడుచుఁ బడుచు లేచి నవ్వుచుమఱలన్
వడివడి నడచుచుఁ గేకల
నిడుబుడుతలఁ గాంచు భాగ్యమెన్న నరిదియగా 47

తే॥ ఆటలాడంగఁ బోయి తా నమ్మయంచు
వచ్చి నోరారఁ బిలువఁగఁ గ్రుచ్చి యెత్తి
ముద్దుఁగొని దించు భాగ్యంబు ముదితలకును
నరిది యబ్బుట తపము సేయంగనైన 48

మత్తకోకిల—తొల్లిచేసిన కర్మజాలము తోరమై వెను వెంటరా
నుల్లమందున చింతసేయఁగ నూడునే యది చుల్కఁగా
నెల్లకాలము రాదు చీఁకటి, యెల్లకాలము వెన్నెలల్
తల్లిలక్ష్మి కటాక్షముండినఁ దప్ప వెప్పుడు భద్రముల్

తరలము—వనజలోచన! పాపసంహార! వాసుదేవ! దయానిధీ!
సనుముదంబునఁ దేలియాడఁగ నాథ! నీకృపఁ జూడవే
యనుచు నిచ్చల హర్నిశంబుల నారయౌ భజియించుచున్
దనమనంబునఁ జింతసేయుచుఁ దా వసుంధర యుండఁగా

వ॥ ఇవ్విధంబున నడచుచుండ నవ్వసుంధరాపూర్వ జన్మ సుకృతపుంజం బుఫలించెనో యన నొక్కనాఁడు విశ్వపతి హృదయంబున నకస్మాత్తుగ విపరీత పరివర్తనంబు దోఁచి, యున్మత్తునింబోలె నత్యంతకౌతుకాయత్త చిత్తుంగావింప, నతండు ముసిముసినగవుల మురియుచుఁ, బరమభక్తుండు నుంబోలెఁ బరమానంద పరవశుండగుచుఁ, బెన్నిధిం గన్న పేదచందంబున నత్యుత్సాహ భరితుండై యొక్కటనిలువక

ఇటునటుఁ బాదచ్ఛాయలిడుచు, మహారసికుండునుంబోలె ముంగిట నిలువంబడి యాతాయాతజనంబుల నెన్నండులేని సరసాలాపంబులఁ బలుకరించుచు, మహాత్యాగియుంబోలె గంభీరవాగ్గుంభనంబులఁ గ్రుమ్మరించుచుఁ, బర్వదినంబునంబలెఁ బరమాన్నంబులభుజియించి సాయంకాలంబగుడు సౌధోపరిభాగంబునఁ గూరుచుండి శృంగారి పురుషుండుంబలె సన్నని కంఠంబున రాగాలాపంబులు గావించుచుండ, వసుంధరయది పండుగాఁ దనడెందంబునంగల కుందుంబాపుకొనం దలంచి, యొంటియున్న తనప్రియుని కడకరుగ సంభ్రమించి—

ఉ॥ పొందుగఁజీరఁగట్టి, తగభూరిమణీమయ భూషణంబులం
దందయమర్చి పూఁతలనునాదర మొప్పఁగమేనఁబూసి, యా
నందముచిందులాడఁగనయారె! సెబాస్, మఱిమేలుమేలునా
నందము చందముల్మెఱయ నజ్జలజేక్షణ సుందరాంగియై. 52

తే॥ తలఁపఁ దళుకులగుమ్మ కుందనపుబొమ్మ
కలిమిగలయమ్మ తమిపువ్వుకలిమిరెమ్మ
యలరువిరితమ్మి గద్దెపై నలరుకొమ్మ
యన వసుంధర చెల్వాన నతిశయించె. 53

తే॥ చకచకల్మించఁ జనుదెంచుచానఁజూచి
విశ్వపతివేడ్క దోఁపంగవింతపడఁగ
సుముఖిముఖపద్మ మలరుచుసొంపుఁగులికెఁ
బరఁగఁగృతకృత్యుఁ డయ్యెడునరునిభంగి. 54

తే॥ మొయిలు లేకయు నెమిలి తా మురిసియాడెఁ
బగలు కలువలజంట తా మిగులవిరియఁ

గారణంబేమొ యెఱుఁగము కాంత! యిచట
వింతయేమది కనుగొంటి? యింతి! నీవు. 55

తే॥ అదిగొ యానంద మేఘోదయంబుగదురఁ
బింఛ విస్తృతి శిఖి యాడ వింతగలదె?
మొనసిముఖచంద్రుఁ డలరుచుముద్దుగులుకఁ
గువలయయుగంబు విరియదే కువలయమున? 56

తే॥ అనుచుఁగాంతుని భావంబునరసిచెలువ
సరసగతిఁదెల్పి, ప్రియుమోముఁజక్కఁజూచి
"కాంత! కడువింత మీచెంతఁగాంచుచుంటి"
ననఁగఁబర్వంబు నేఁడుమాకనియెనతఁడు. 57

తే॥ పరువముసమించు మనకిప్డుపర్వమైనఁ
బరువు మిగులంగ జీవికల్ పరిఢవిల్లుఁ
బర్వములఁగాదె భారతప్రతిభవెలయుఁ
బరువమునవారు పర్వంపుఁబరువువారు. 58

తే॥ అనుచు నీరీతి సరసంపుఁ జనవు మెఱయ
దంపతులు మోదమునఁ దేలి తనియుచుండ
విశ్వపతి "కాంత! నీరాక వింతఁ గొల్పుఁ
గతముఁ దెల్పుము" నాఁగ నాగరిత యనియె 59

ఉ॥ ఇంతులు కాంతు చెంతలకు నేగుట వింతయె లోకమందు? నే
కాంతము కూరుచుండి తమకంబునఁ గంతు విలాసముల్ తగన్
సంతస మందుచుంటఁ గని చానలు దగ్గఱఁ జేరకుందురే?
యెంతటి భాగ్యశాలులకు నిద్దఱఁ గల్గు విహారసంపదల్? 60

చ॥ సరగ నతండు పల్కె నిటు చానరో! పల్కులపొందు చూడఁగా
నరుదుగ నీ మనోరథములందని పండ్లకు నఱ్ఱుచాచునం
చరయఁగ నౌనుఁ, గాని కమలానన! వెఱ్ఱివి చింతసేయవే
వెరవున సంపదల్పొదలు వేడ్కల వింతలఁ బ్రొద్దుపుచ్చినన్ 61

తే॥ ధనము గలవాఁడె పురుషుండు ధర్మపరుఁడు
ధనము గలవాఁడె చతురుండు తాత్త్వికుండు
ధనము గలవాఁడె ధీరుండు దారమూర్తి
ధనము లేకున్న వానినిఁ దలఁపరెవరు 62

తే॥ కాన నెవ్విధినైనను దాని గడన
సేయుటయె లెస్స, జతనముల్ సేయుచుందు
"జరయు మృతియును లేనట్లు జగతి జనుఁడు
ధనము నార్జింప వలెనని యనిరిగాదె" 63

చ॥ విరివిగ సంపద ల్పొదల వేయితెఱంగులఁ జింతసేసి, నే
నిరవగు మూలముం దెలిసి, యీప్సిత సిద్ధికిఁ దోడ్పడంగ, స
త్వరముగఁ బాన్కిమై మెలఁగి పాయక లాభము నొందఁగల్గితిన్
గురుతుగ లక్షరూప్యముల గుఱ్ఱపుఁ బందెమునందు గెల్చితిన్

తే॥ పరఁగ 'క్రాస్ వర్డ్ ఫజుల్' వేసిపాటు వడితి
నందుఁ బదివేల రూప్యంబు లందెనాకుఁ
జెలువ! దానికి నేఁడునేఁ జెలఁగుచుంటి
నీవదేమని భావింతొ భావమందు. 65

తే॥ అనఁగ నాయింతి యిటువల్కె నతనితోడ
నాథ! మీరర్థమును గెల్వ నాకుముదమె

గాని నే నొక్క తీరుగా వాని నరసి
మురియుచును వచ్చి చేరితి మోదమలర. 66

ఉ॥ సద్విధు లెన్నియే నరసి సల్పుచు నెట్లు సమార్జితార్థము
ద్యద్విధిఁ ద్యాగ భోగముల కర్హము సేతు నటంచు నెంచి, యే
తద్విధి నొప్పుచుందురని తల్చితి నెమ్మది యుల్లసిల్లఁగా
„సద్వినియోగమే పుడమి సంపద కెప్పుడు రక్షణంబగున్ 67

తే॥ పరఁగ శిశు రక్షణాలయ ప్రతతి నేని
గరిమ వైద్యాలయంబుల గణము నేని
కోరి పఠనాలయంబుల కోటి నేని
నిలుపఁ బూని తిరని నేను నిర్ణయింతు. 68

సీ॥ సకలసంపదలు పో సాగిన విడువని
సత్యహరిశ్చంద్రు సత్యమెఱిఁగి
ధరనేలఁ జాలిన తమ్ములుండియు ధర్మ
తనయుఁడు విడువని ధర్మమెఱిఁగి
కోరియిమ్మని వేఁడఁ గోసి దేహమునిచ్చు
శిబిచక్రవర్తి సచ్ఛీల మెఱిఁగి
పరదాస్యములఁ బాపి ప్రజలఁ బ్రోవఁగఁ బూను
గాంధి మహాత్ము త్యాగంబు నెఱిఁగి

తే॥ త్యాగ భోగ విదూరకమా ధనము గలుగ
ఫలము లెయ్యవి యని యెంతొ ప్రజ్ఞఁ దెలిసి
వివిధ ధర్మ ప్రధాన సద్విధుల కొసఁగి
యలరు మనుజుండె ధరను సద్యశముఁ గాంచు 69

తే॥ అనఁగ నాతఁడు వేగమే యదిరిపడుచు
దోఁకఁ ద్రొక్కిన త్రాఁచునాఁ దోఁప మదికి
"మంచిదానవు నినుమించు మగువగలదె
చాలు నీ నీతి కఱపులు చాలుఁ బొమ్ము" 70

ఉ॥ ఎక్కడి ధర్మకార్యముల వెక్కడ దానములీ ధరిత్రియం
దెక్కడఁ జెమ్మటల్విడిచి యిమ్మెయిఁ జేర్చిన దుడ్డుపోకడల్
చిక్కిన కాలమందు నివి చేరి సుఖంబొడఁ గూర్చునేమి? నే
నొక్క తృణంబునేనియును నొప్పను నష్టము సేయ నామదిన్.

తే॥ ఇంతి! నీ పల్కుమది కెంతొ వింతఁగొల్పుఁ
గూడఁ బెట్టిన యర్థంబుఁ గొల్లఁబెట్టి
యూరకుండుట మనుజుల కుచితమౌనె?
తన్ను మాలిన ధర్మంబు ధరను గలదె? 72

తే॥ ఓ వసుంధర! నీవింక భావమందు
నిట్టి కొఱగాని తలఁపుల నెంచకెపుడు
వెఱ్ఱియైనను నివ్విధి నెత్తలఁ జెంది
సొమ్ముఁ జేకూర్చి వమ్ముగాఁ జూడఁగలఁడె? 73

క॥ అప్పుడది యింతి వినఁగనె
మెప్పుఁగఁ దన పతికిఁ బలికె మించుచతురతన్
దప్పు గలదేమొ యెఱుఁగను
నిప్పగిదిఁ గఠోరవ్రతము లెందును దగవే? 74

క॥ సొంపుగ విత్తము లుండినఁ
జొంపుగ సత్క్రియలు సలుపఁ బెరుగును బుడమిన్

ఇంపుగఁ జెలమలుసల్లిన
సొంపుగ నీరూరుచుండుఁ జొక్కంబగుచున్ 75

తే॥ ఏమియనుకొన్ననిపుడు నాకేమిఫలము,
పాపిదుర్విధి దయమాలి పట్టిచూడ
ననుచుఁ దనమదిఁ దలపోసి, యనియె మరలఁ
బ్రియుఁడ! వినుమంచు నీరీతి వినయమునను. 76

తే॥ సతికిఁ బ్రియునెడ నీపాటి చనువు చనదో?
కోటిపతియని డీటగు మాటెగాని
చూచిమురియుట కొకచిన్ని సుతుఁడులేఁడ
గొడ్డువారలు పరికింప గ్రుడ్డివారు. 77

ఉ॥ పాత్రములెంచి దానములపారముదంబున సల్పుచుండ, స
త్పుత్రులు పుత్రికల్పొదలి భూరిగుణోన్నతిఁ బొల్పుచుండ, స
న్మిత్రులు బంధువుల్గలుగఁ, బ్రేమమయంబు జగంబు సర్వమున్
బుత్రులు లేనిచోగతులు పుట్టవునానుడి నేఁడుక్రొత్తదే? 78

తే॥ అనిన సరిక్రొత్త యెత్తు నీవరసితిపుడు
దేశకాల పరిస్థితు ల్దెలియఁ గలిగి
మాటలాడిన నదికొంత పాటియగును
చేల! నీవేల యీలీలఁ బ్రేలుచుంటి? 79

సీ॥ దేశ దేశము వేఱుదేశంబుఁ గబళింపఁ
గయ్యంబునకుఁ గత్తి దుయ్యుచుండ
దేశ మధ్యమున దురాశలు మితిమీఱి
విప్లవంబుల వేగఁ బెంచుచుండ

జనసంఖ్య యమితమై మనుటకు దరిలేక
గోడు గోడునఁ గ్రుంగి కుములుచుండ,
మహిళా సమాజముల్ మానుగ సంతాన
నిర్బంధ శాసన నియతిఁగోర,

తే॥ నేమి సుఖమంచుఁ బుత్రుల నెదను దలఁతు
పుట్టినంతనె తీఱునే పుష్పఁబోఁడి!
యిల్లలుకఁగానె పండుగ చెల్లునట్టు?
లవల నెన్నియొ సవరింపు లతివ! తలఁతె? 80

చ॥ చదువులు సంధ్యలంచు మఱి చానలు చీరలు సారెలంచునుం
బదిలముగాఁగ ఖర్చులకు బాటలు వేయి విధంబులుండునే
నది మది మెచ్చి యెవ్విధిని నౌనని యూరకయొప్పుకొందు, నో
ముదిత! యివేటి మాటలిఁక మోహము వీడుమువెఱ్ఱి పోకడన్

తే॥ దేవుఁడిచ్చిన యంతతోఁ దృప్తినంది
కాల మొకరీతిఁ గడుపక బేలుపోయి
యేల చిక్కులఁ దగులుకొల్పేల చెపుమ
యడుసు త్రొక్కఁగ నేల కాల్గడుగనేల? 82

ఉ॥ పుట్టినఁ బుట్టుఁగాక, యికఁ బుట్టక యున్నను మేలెగాక, నా
కిట్టి విచారముల్వలదిఁకేల పరస్పర వాదమిప్డు, నీ
మెట్టిన యింటిపైఁ గడఁగి మేలు దలంచుట భావ్య, మింక నీ
విట్టి విరుద్ధ భావముల నెప్పటి కేన్మది నిల్పఁబాడియే? 83

తే॥ అంత సయ్యింతి కాంతుని చెంత వీడి
వింతకోపంబు తనమది కెంతొ గలుగ

సౌధ ప్రాంతము దిగివచ్చి స్వాంతమందుఁ
జింత సేయుచు నధిక సంతాపంతఁ బొగిలె. 84

ఉ॥ ఇంతులు లేని కాపురము, నెంతయుఁ జంద్రుఁడు లేనిరాత్రి, మే
ల్మంతిరిలేని రాజ్యము విలాసములుల్లసిలంగఁ బొల్చు ప్రా
బంతులు లేనితోఁటయును, భావము లేని కవీంద్రుపల్కు, స
చ్చింతన లేనిలుబ్ధజన చిత్తము, శోభనముల్ధరిత్రిలోన్ 85

వ॥ అనంతరంబ యవ్వసుంధర తన దౌర్భాగ్యంబునకు వగచుచుఁ గాలంబుఁ గడపుచుండ నొక్కనాఁడు నిశీథంబున నొక్కదివ్య పురుషుండు ప్రత్యక్షంబయి, "యోసాధ్వీ! యేలవగచెదు, నీయుదరంబున జగన్మోహన కరుండగు నొక్కసుపుత్త్రుండుదయింపఁ గలఁడు, అతని మూలంబున మీవంశంబు లోక విఖ్యాతంబగు. చింతింపకు "మిదిగో యీయమృత ఫలంబుఁ బరిగ్రహింపు మ"ని వచియించి యంతర్ధానంబు నొందిన నచ్చెలువ కన్నులుదెఱచి నలువలంకులు కలయంజూచి యేమియుఁగానక, యది యంతయు భగవదనుగ్రహంబని లోలోన సంతసించుచు, నపరిమితానంద కందళిత హృదయయై పరఁగుచుండఁ గొంతకాలంబునకు— 86

చ॥ సుదతి వసుంధరారమణి చూలు ధరింపఁ గ్రమక్రమంబునన్
విదితములయ్యెఁ జిహ్నములు, వ్రేఁగు గనంబడె దేహమందునన్
సదమలకాంతి పుంజములు చయ్యన గేహమునిండి పర్వెఁ, దా
నదయుఁడు లుబ్ధవిశ్వపతి యక్కట! యేమిదియంచుఁ జింతిలెన్

తే॥ తల్లిదండ్రులు లేనట్టి తనకు ముందట
నెనటకేఁగుఁ బ్రసూతికై యిందువదన

దైవ పరతంత్ర నిజసర్వతంత్ర యగుచుఁ
గాలయాపన పరురాలు గాఁగఁ దనరె. 88

తే॥ తాను దినకున్నఁ బరులకు దానమిచ్చు
బుద్ధిగలయది గావునఁ బువ్వుఁబోఁడి
కరుగు హరుగున జనులెల్ల నెలమిఁగొలుపఁ
బ్రసవ సమయ నిరీక్షణ పరత నుండి. 89

తే॥ పతికి నెఱిఁగింప నాతఁడు సతినిఁ గాంచి
యేమిసేయుదు నాచేత నేమియగును
ధర్మ వైద్యాలయమునకుఁ దద్ద నరిగి
కాన్పుసేయించుకొని రమ్ము కాంత! యనియె 90

ఉ॥ పుత్త్రిలఁగోరి పేదలిలఁ బూటకు గంజికిలేక యుండియుఁ
యాత్రలు సల్పుచుం గడఁగి యర్చలు సేయుచుఁ, జెట్టుపుట్టలఁ
స్తోత్రము చేసిచేసి, తుదిఁ జూలి ఫలంబును నందుచుండ, నే
మాత్రము సంతసింపఁడిది మాయయొ విత్తపిశాచ కృత్యమో 91

ఉ॥ భోగము రుద్రభూమి, తగుపెంపు దారికి మూఁత బండ, స
త్త్యాగము చౌటినేల, విబుధాళి తలంకెడు నద్దుకంప, సం
రాగము రాచపుండు, గుణరాజికి మూసిన యుక్కుతల్పు, నా
నీగతి లోభదుర్గుణము నేల సృజించెనొ బ్రహ్మయక్కటా! 92

క॥ సతి యావిధమునఁ బల్కిన
పతిమాటకుఁ దొట్రుపడక భక్తి యెసంగన్
మతిఁ గొనుచు దేవదేవుని
మతిఁ దలఁచక నిశ్చయమున మానుగ నుండెన్ 93

క॥ నవమాసములు గడవఁ బ్రి
సవసమయము దాపురింప సతినొప్పులిడన్
నవలాజనములు మెలఁగిరి
జవమున జలకంబులార్చి చతురత యొప్పన్ 94

మత్తకోకిల॥ దేవదేవ! దయాపరా! నను దీనపోషక! మాధవా!
కావవే నిను వేఁడుకొందును గాఢమౌ వెతఁజెందితిన్
భావమందున నిట్లు భామిని భక్తిచేఁ గొనియాడఁగాఁ
గావు కావుననేడ్చు బాలుఁడు కానుపించెను భూమిపై

తే॥ బాకి పత్రంబునకుఁ గాలపరిమితి చన
విశ్వపతి బైటఁ గూర్చుండి విసిఁగి కొనుచు
నేమిసేయుద మంచెద నెంచుచుండఁ
గొడుకు పుట్టెను నీకంచు నుడివె నొకతె. 96

ఉ॥ అక్కట మంచివార్తయిది, యూరయఁగొంపను గూలఁదీసెనే,
నెక్కడఁదెత్తు వీనికయి, యేమి తలంచిన నేమయౌఁగటా!
నిక్కముగాఁగఁ బూరుషుల నేర్పులు సాగునె లోకమందుఁ, దా
నొక్కటిఁదల్ప దైవము మఱొక్కటిగాఁగఁ దలంచుచుండెడిన్

తే॥ మున్ను పత్రంబు పాడయి మునిఁగె ననఁగ
దానికిదియొడు ధనము పోదారి గలిగె
"గోటి చుట్టుకు ఱోఁకటి పోటునాఁగ"
నహహా! విశ్వంబు పరికింప నచ్చెరువగు. 98

తే॥ కాని యిది యెల్ల మన పూర్వకర్మమేమొ
యనుభవింపక తీఱునె యరయ నిపుడు

జోటఁ దలదూర్చి జోఁకటి పోటు కడల
నేమి లాభము చింతింప నేమి యగును? 99

తే॥ అనుచుఁ దలపోసి మంత్రసానమ్మఁ బిలిచి
ఖర్చునాకుండఁ జూడుము కార్యమనుచు
బేడనొకటి దానిచేఁ బెట్టిపలికె
నదియు నాతని త్యాగంబు నరసికన్న. 100

మ॥ అరయన్ సూతిగృహంబు వెల్గఁగఁ బ్రసన్నాత్ముండు బాలుండు,
నిర్జరతేజోలలితుండు నానలరె జాగ్రత్ప్రాణ నాదంబునన్
వజిగె న్మాతృమనోసరోజచిర ఖేదంబప్పు ఛేదుడ్చిన
స్త్రైజుఁగన్ ఖేదప్రమోదముల్ భువినిజంబే తంబులై తోఁచెడిన్

తే॥ బాలుని ప్రసన్నవదన ప్రభావిశేష
మిరవు సద్గుణ రాశికిం జెలుఁగనయ్యెఁ
బుణ్యవాసన వెన్నంటుఁ బుట్టఁగానె
ప్రాప్త పుట్టంగ నక్కొను తావియట్లు. 102

చ॥ పుడమి ముదంబు వొందగ, కడుం బొదిగ సద్గతి రావబాట, వం
గడము మహీరుహంబు పెనుగావరి, కష్టపుఁ దాప బాధలం
గడపు నిదాఘ మార్గప్రప, గాసిలు దీనజనాళి రక్ష, యాఁ
గొడుకునుఁగాంచి సంబ్రపడు కోమలి భాగ్యము చెప్పశక్యమే.

తే॥ పుట్టి నదినాళ్లు జరిగెను బట్టికప్రము
పురుడు నీటెను బొత్తిళ్లఁ బెరుగుచుండె
మోహనుండను నాఁగఁ బేరిడి ముద్దుకొడుకు
పెంచుచుండెను దల్లి తానంచితముగ. 104

ఉ॥ ఎప్పుడు నప్పు చింతలును, నెప్పుడు పత్రము వ్రాఁత కోఁతలున్
జప్పున వడ్డి చాలదని జాముకు జాముకు వెంబడించి, యే
చొప్పుననైన విశ్వపతి చూచు ధనంబొడఁగూర్చు మార్గమున్,
మెప్పును గూర్చు మోహనుని మేలిమొకంబును జూడఁడక్కటా!

తే॥ తనయుఁడను దిన మీరీతిఁ దనరుచుండె
దైవ బలమున వెల్గొందు తరువునట్లు
జనని యాతని దౌర్భాగ్యమునకుఁ గుల్లి
మంచికాలంబు రాకకుఁ బొంచియుండె. 106

ఉ॥ ఒక్కదినంబు విశ్వపతి యొక్కట నొక్కఁడు కూరుచుండి, తా
నెక్కడివో విశేషముల నెంచి, మనంబునఁ బొంగుచుండు న
ట్లక్కజమై కనంబడఁగ, నక్కున మోహను నాతి చేర్పఁగా
ఫక్కున నవ్వె మోహనుఁడు పాధియుతంబుగఁ దండ్రిఁజూచుచున్

తే॥ ఔర! ననుఁ జూచి నవ్వెద వరసితేమి
వ్యయము సేయంగఁబుట్టి తిననిరియొ గాని
వ్యయము గియములు నాయెడ నయముగాపు
దేవుఁడే నిన్నుఁ బెంచెడు దిట్టవగుము. 108

తే॥ అనుచుఁ దనయునిఁదొడనుండి యవలఁ దిగిచి,
కొనుచుఁ బొమ్మని భార్యకుఁ గోపమడర
నొప్పగించుచు మాకిట్టి వొప్పవనుచు
లేచిపోయెను లెక్కలు చూచుకొనఁగ. 109

చ॥ మొకము విశాల భావ పరిపూర్ణత ముద్దులుమూటఁ గట్టఁగన్
నిక నిక నవ్వు వేగము వివేక ఘనుండని తెల్పుచుండఁగన్

ప్రకట గుణోన్నతుండనఁగఁ బ్రౌజ్ఞయుఁ జేష్టలు గానుపింపఁగన్
జకచక నాడుచుంబడుచుఁ జాతురి మోహనుఁడొప్పె బాలుఁడై

చ॥ చురుకుఁ దనంబుఁ, జేవయును, సోయగమున్, సుగుణాళి, మించఁ
గన్-బిరబిర రండు రండనుచుఁ బిల్లలఁ గ్రీడకుఁ బిల్చుకొంచుఁ, దా
సురుచిర బాలబాలికలఁ జక్కులఁ జందుఁడు నాఁగనొప్పె, భా
సుర మురళీధరుండు బలెఁ జూడ్కికి మోహనుఁడొప్పె సొంపుగన్

ఉ॥ కొట్టఁడ యెవ్వరేమనినఁ, గోపము చూపఁడ తోడి వారిపై
దిట్టఁడు బాలకుల్ కసరఁ, దియ్యని మాటల బుజ్జగించెడున్,
ముట్టఁడు కాసు వీసముల మోహనుఁడెక్కుడు బుద్ధిశాలియై
దిట్టఁడు, కార్యసాధకుఁడు, తీర్పరి, యౌనని లోకులెన్నఁగన్.

చ॥ వినయముతోడ బాలకులు వీధినిఁ బల్కుయుఁ బుస్తకంబులున్
గొని బడికేగు సంబరము కూరిమి మీఱఁగఁ జూచు తల్లులం
గని ముదమంది చిత్తమునఁ గాంత వసుంధర కోరుచుండు "నా
తనయుఁడు నిర్విఘ్నంబడికిఁ దానెపుడేగునో" యంచు నిచ్చలున్.

తే॥ పరఁగ నాతని కాతేండ్ల ప్రాయమైనఁ
దండ్రి మనమునఁ జదివింపఁ దలపకున్నఁ
దల్లి యొకనాఁడు భర్తతో మెల్లఁగాను
నక్షరాభ్యాస మెప్పుడంచడుగఁగాను. 114

తే॥ తెచ్చిపెట్టితే కుంపటి తెల్లమయ్యెఁ
బెండ్లి పుడమిని మెడకుఁ దాఁ బెద్దగుదియ
తన్నుఁ గట్టంగఁ బ్రాఁల్లు తాఁగొన్నపగిది
నేమి చదువులు సంధ్యలిదేమి పలుకు? 115

చ॥ ముగుద గృహంబుఁ జేరఁగనె, పూజలు, నోములు, యాత్రలంచు
నా-వగ వ్రతనిష్ఠ, లాపయిని బాయని దీక్షలు, పుత్రప్రాప్తికై
తగ నటుపైని దానములు, ధర్మము, విద్దెలటంచు, నిత్యమీ
పగిదిని దుర్గుపోకడకు భార్యయ మూలము ధాత్రిలోపలన్ 116

చ॥ పొదుపుగఁ గాపురంబొదవఁ బోలును వానికి గారవంబు నే
యదనున గాని, కష్టసము పార్జిత విత్తము కొల్లఁబెట్టి, యీ
చదువులు నేర్చుకొంట, విధిచాలక పోవుటెగాక యేమగున్,
జదువులు సంధ్యలు న్వలదు, చాలునిఁ కేటికి మాటలాడఁగన్

క॥ చదివించిరె నను జనకులు
చదివిన వారెల్లనాకు సాటియె చెపుమా
పదవికిఁ జాలని చదువుల
నొదవును నపకీర్తి . ధనము నూడునుగనుమా. 118

ఆ॥ వె॥ బాలుఁడొక్క-రుండు పసివాఁడు మనకేల
తిండి లేక యున్న దేవురింపఁ
జదువులొల్ల నేను పసిగావు మనకవి
విడుము చిత్తమందు వెఱ్ఱిమతము. 119

క॥ అని తెలుపఁగ నయ్యంగన
విని నాయది వెఱ్ఱి మతమొ పిఱిడి తనమో
కని కల్ల నిజము తెలిసిన
వనజాక్షుఁడె తీర్చుఁగాక వనరుటయేలా. 120

క॥ అనుచు వసుంధర యంతట
మనమునఁ దలపోసి విధిని మఱి మఱి దూఱెన్

తనయుఁడు మోహనుఁడెప్పుడు
పని పాటలులేక తిరిగె బాలురతోడన్. 121

మ॥ చని మోహనుఁ డొక్కనాఁడతుల చంచత్పుండరీకోల్లస
ద్వనికిం, బాలురతోడ నాడుచు మహాప్రాగల్భ్యముం జూపుచుం
గనియెం బూరుషు నొక్క దివ్యనటుం గారుణ్యపూర్ణాకృతిన్
వినియె "నోమోహన! గొడ్డు వోవఁదగ వావిద్యంగడింపంగదే.

తే॥ పదియు రెండేండ్లు నిండిన బాలుఁడగుట
నలువలంకలు ముమ్మాఱు గలయఁజూచి
వింతయేమిది యని యెంచునంత మఱల
వినియె మోహన! చదువను జనుము యనుచు

తే॥ ప్రమసి పరికించి యెదను సంభ్రమము మీఱ
మనము చలియింపఁ జెచ్చెఱఁ బదిల పఱచి
కొనుచు నట నిల్వఁ గాదని తనకుఁదోఁపఁ
గానె బాలుర నెల్లరఁగాంచి పలికె. 124

తే॥ పుండరీకంబులను గోరి యెండగాలి
కుండి తిరుగంగ మనకేల మొండితనము
రండు రండింకఁ బోదమిందుండఁదగునె
పుండరీకము లుండు నుద్దండలీల. 125

మ॥ అనుచున్ బాలుర వెంటఁ బెట్టుకొని తానత్యంత చిత్తభ్రమం
బున వేగంబ గృహంబుఁ జేరుటకునై పోవంగ నుద్యాన సీ
మను సాయంతనవేళ నొక్కరుఁడ సామాన్యంబు సన్న్యాస మీ
యను బూనిన్నైనె గుంపులో నిలిచి యాత్మానందముప్పొంగఁగన్

## —•••  శంకరుని యుపన్యాసము.  •••—

మ॥ అటనుద్యాన వనంబునం దనరు న
        ధ్యక్షుండు మోత్కుండు చ
క్కటి విద్వాంసుఁ డొకండు నిల్చుకొని వీఁ
        కన్ మూఁకలం జేర్చి య
క్కటికం బొప్పఁగ బోధసేయుటకునై
        కాంక్షించి యిట్లాడె, నో
పటు ధీశాలి జనంబులార! విను డీ
        ప్రార్థింతు మిమ్మెల్లరన్. 127

ఉ॥ నేను గళింగదేశజుఁడ నిర్మలచిత్తులు నన్నుఁ బిల్తురీ
మానవలోకమందు బహుమానము తోడను శంకరుండు నా,
మానిత వృత్తి నాకిదియ, మానవసేవయ యుత్తమంబు, స
మ్మానముతోడ నాపలుకు మాటలు మీరు వినంగవేఁడెదన్.

చ॥ తిరిగితి మిన్నినాళ్లు పరదేశపు దాసులమై కృశించి, యీ
పరమ దయాళు రెల్లరును బాధలకోర్చి విదేశవాసముల్
జరిపి, స్వదేశ దాస్యమును జయ్యనఁ బాపిరిఁ కేమి మాకనన్
బరఁగ స్వతంత్ర వాయువులు పర్వెను హైందవ జాతి భాసిలన్.

క॥ దేశంబిప్పుడు మనదే
దేశముఁ బాలించు ప్రభులు దేశప్రజలే
దేశపు హక్కుల గనుఁగొని
దేశము రక్షించుకొనెడి దీక్షయు మనదే. 130

చ॥ సలలిత జాతి సంస్కృతికిఁ జాలిన విద్యలు, ప్రాజ్ఞకోటిలో
మెలఁగఁగఁ జాలు ప్రౌఢతయు, మేలిస్వతంత్ర ప్రవృత్తి, జీవికల్
లలిసమతాప్తి డెందముల, లాఁతి తలంపులు లేక యుండుటల్,
తలఁప స్వతంత్రదేశములఁ దప్పక హక్కుగఁ గోరు కోరికల్ 131

చ॥ తలఁచిన యంతఁ జేకుఱవు ధర్మపరత్వము చేతనెల్లరున్
మెలఁగినఁ గాని, "యంగిటను బెల్లము నాత్మవిషంబు" నాఁ
గఁగీడ్తలఁపుల పోకడల్విడిచి, తత్త్వమెఱింగి భృశానురక్తులై
మెలఁగు హితైక దృక్కులకు మేలు లభింపదె యెల్లకాలమున్.

తే॥ గాంధిమతమున నిర్మాణ కార్యక్రమము
నైహ్యభావాన నిర్మలనీతి నియతి
ప్రకట రాజ్యాంగ పరిషత్సమస్తధర్మ
వితతి నెఱవేర్చు పౌరుఁడే విజ్ఞుఁడిలను. 133

తే॥ అన్ని పనులకుఁ గ్రమశిక్ష యాదిమూల
మదియ లేకున్నమానవుఁడంధకార
కూపమునఁ బడి తెలియక కుములుచుండుఁ
బశువులకునైనఁ గ్రమము చూపట్టుఁగాదె? 134

తే॥ ఆర్యవచనమ్ము "శరీర మాద్యమ్ము ధర్మ
సాధనమ్మ"ని వినుము విశాలమతినిఁ
గాయ మింతేని చెడక వికాసమొంద
మనుము మానవ! సుఖముగ మహినిఁ బాగడ. 135

క॥ విజ్ఞానమె సర్వస్వము
విజ్ఞానమె మిత్రతతియు విబుధాప్తులరున్

విజ్ఞానమె నవ నిధులును
విజ్ఞానము లేని నరుఁడు వ్రేఁగు పుడమికిన్ 136

సీ॥ సత్య మహింసయు సరి మూలములు గాఁగ,
నయము, సద్వృత్తి, ప్రాణంబుగాఁగ
భూత దయాప్రౌఢి, ప్రోది ప్రమాఁకును గాఁగ
బురుషార్థములు భూరిశాఖలునుగఁ
బరఁగననోన్నతల్ పత్రంబులునుగాఁగ
శౌర్యధైర్యములు పుష్పములుగాఁగఁ
. త్యాగంబు, సమబుద్ధి, తగుఫలంబులుగాఁగ
నాశ్రితుల్ సుఖయించు ననువు గలుగ 137

తే॥ వెస విశాలంపు భూమిపై విస్తరిల్లి
భూతగణములు తృప్తిమైఁ బొదలుచుండ
దిక్కుదిక్కులఁ దేజముల్ పెక్కులడర
మానవుండను దరువొప్పు మహినుతింప. 137

సీ॥ జగములేలఁగఁ జాలు శాంతిమార్గముఁ దెల్పు
గాంధి మహాత్ముని ఘనతఁ గాంచి
పరఁగ దేశ విదేశ ప్రౌఢ నాయక కోటి
మెచ్చు పండిత నెహ్రు హెచ్చుఁదెలసి
జాల గర్జించు ధారాళమా వాగ్ఝరి
గలుగు రాధాకృష్ణు గరిమనరసి
ప్రాక్ప్రతీ చీనవ్య భవ్యసాహితిఁ గూర్చు
నల రవీంద్రునిక ళా కలన మెఱిఁగి,

తే॥ పేరుఁడై యోగమహిమ ప్రవీణుఁడనఁగ
వెలయు నరవింద యోగీంద్రు కలిమి గలిగి
చాతురిన్మించ హైందవ జాతి వెలఁగు
ననుచు దెలిసిన నాఁడె మీ ఘనత నిలుచు. 138

తే॥ వెలఁది జూదంబు నాదిగాఁగలుగు సప్త
వ్యసనములఁ గూలు మనుజుఁ డిందెసఁగఁగలఁడె
వేరు పురుగులు తొలఁచిన వృక్షముక్రియ
నిట్ట నిలువున నశియించి వట్టిపోక. 139

తే॥ అనుభవంబును శాస్త్రార్థ మరయనట్టి
కుచ్చితపు వైద్యుఁడిలకోఁగిఁ గూల్చునట్లు
లోక విజ్ఞాన శూన్యుఁడౌ లుబ్ధుఁడు తన
కులము గౌరవమును నేటఁగూలఁద్రోయు. 140

క॥ గంగా వాహిని వడువున
రంగారెడు శంకరుండు, రంజిల బుధులున్
బొంగారు వాహినింబలు
సింగారముతో నుపన్యసించి ముగించెన్. 141

తే॥ కలకలంబులు చెలరేఁగెఁ గరతలంపుఁ
దాడనంబులు మిను ముట్టి దండ డించె
శాంతి ఓమ్‌శాంతి యనఁగనె శంకరుండు
పొందుగా సభ ముగిసె "జై హిందు" వనుచు 142

ఉ॥ అంతట మోహనుండు తనయాత్మ గతంబగు భ్రాంతిఁబాసి, మే
సంతట బుల్కలుం బొడమ నంతట నింతట గంతులేసి, తా

నంతటి బోధశాలియగు టారయ నెట్టులో యంచు నెంచుచున్
సంతస మొప్పఁ దల్లికడఁ జాగి, విచారము నిర్వచింపఁగన్ 143

ఉ॥ మోహన! యేమి సేయనగు మూర్ఖుఁడు మీ జనకుండ దేమిటో
యూహల నల్లుచుండుఁ, దలయూచఁడు మాటల కేమి సెప్పినన్
మోహిత చిత్తుఁడై జగము పోకడనైన నెఱుంగఁ జాలఁడు,
త్యాహిత విత్తలోభ జనితాంధ్యులఁ దెల్పన సాధ్యమేరికిన్.

ఉ॥ చూచితిఁ జెప్పిచెప్పి, తగఁ జూపితి లోకహితంపుఁ ద్రోవఁ దాఁ
జూచుచుఁ బిచ్చివానివలెఁ జూడ్కుల నల్లడఁ ద్రిప్పి, నేఁ
డోఁచఁగ లేను దుడ్డును దూరము పోవును నేమి సేయనో,
నేచిన దుడ్డు పిచ్చి తలకెక్కిన వారలు సమ్మతింతురే? 145

శా॥ అన్నా మోహన! లుబ్ధుఁడా జనకుఁడజ్ఞానాంధుఁడై కానఁడే,
మన్నంబుట్టెడు పెట్టుటిట్లు, తగవే మంచున్ మదిం దల్పఁడే,
నెన్నెన్నో హిత వాక్యముల్ పలికి చాలింకెందు కంచుంటి, నీ
పున్నెంబెట్టులో యట్టులే జరిగెడుం "బుట్టించి పుల్మేపునా"

చ॥ అనుటయు మోహనుండనియె నమ్మరో! ఖేదముఁ జెందఁబోకు, మే
యనువుననైన నేఁజదువు సంచిత పద్ధతి నేర్చుకొందు, నే
జనకుని నెమ్మనంబునకుఁ జక్కఁగ నెక్కువిధంబుఁజూతు, నా
పని యటు గానిచో నవలఁ బంకజనాభుఁడె దిక్కు నాకగున్. 147

వ॥ అని యనేక ప్రకారంబులఁ దల్లి నోదార్చి, దివ్యపురుషానుగ్రహో
ద్బుద్ధ జన్మాంతర సుకృత సంస్కారంబులెల్ల నొక్కుమ్మడి మూర్తీ
భవించి పొల్చెనో యన నొప్పు నమ్మోహనుం డన్నంబుఁదిని,
తల్లిచే నను గృహీతుండై సౌధంబునఁ బల్యంకంబుపైఁ గలవ

రించు వానివలెఁ గన్నులు మూసికొని యేమేమియో గొణుగు కొనుచు, వ్రేళ్లపై లెక్కిడుచుఁ, దటాలున లేచి కూర్చుండి న ల్దడఁ జూపులు నిగుడించి యేదియో పరికించు వానివలె నటించు చుఁ, జెచ్చెఱఁ బరుండి బిఱ్ఱబిగిసి మూల్గుచు, నిదురపట్టక తబ్బి బ్బు పడుచున్న తండ్రికడకుంజని, పిలిచి, నమస్కరించి, దగ్గఱఁ గూర్చుండి, ప్రసంగముం దెచ్చి, తనకు దివ్యపురుషుఁ డొసఁగిన యుపదేశము దొఱకొని యుపన్యాసాంతమువఱకు జరిగిన యా వద్వృత్తాంతంబు నివేదించి, సవినయంబుగఁ దన్నుఁ జదివింపు, మని ప్రార్థింపఁ దండ్రి యిట్లనియె. 148

చ॥ బయటకుఁ బోవనేల, చెడు బాలురఁ గూడి చరింపనేల, యీ
నయములు నాకు నేర్పెదువె, నాకు నెఱుంగని ధర్మముండునే,
భయమొక యింతయేనియును బాలుఁడ! నీమది లేకయుండు, నీ
నయములు గట్టిపెట్టుమిఁక, నాకడఁ జెల్లవు లేచిపొమ్మనన్. 149

తే॥ బిచ్చమెత్తియుఁ జదివించు పేదలుండఁ
గోటి ధనపతివైన నిన్ గూర్మికొడుకు
చదువు చెప్పించు మనికోర నదియుఁ దప్పె?
జనక! మన్నించి చదివించు మనిన నతఁడు. 150

ఉ॥ మన్నన లేదు నాయెడల, మాయల మాటల మానుమింక, నేఁ
గన్నది లేదు నీవలె వికారపుఁ గూతల కట్టువారలన్.
"పిన్నది పిట్టకూఁత దగఁ బెద్దది" నానుడి తల్పువచ్చె నే
నున్న ధనంబు కొల్లగొని యూరక బిచ్చముఁ గొందునోతుదిన్

తే॥ అబ్బ! నేనొక్క దమ్మిడియైనఁగాని

నిన్నుఁ జదివింప నీయను నిశ్చయంబు
అవల నీకెట్లు తోఁచిననటుల నడచు
కొమ్ము మోహన! నిదురింపఁ బొమ్ము నాఁగ. 152

తే॥ ఏమి దుర్భ్రమ, దుశ్చింత, యితనికిపుడు
కాల పరిణామమైనను గాంచలేఁడు
విడఁడు తనపట్టిదేమిటి వెఱ్ఱిమతమొ
మూర్ఖులను దెల్పు వారేరి ముజ్జగముల. 153

తే॥ అనుచుఁ దలపోసి నిద్రింప నరిగెఁ గాని
భావములు పెక్కుతరఁగలై పరలు కతన
నిదుర పట్టక యిటు నటు కదలుచుండ
భావమొక్కటి తనమదిఁ బదిలపడియె. 154

తే॥ అంతలోనన నీవేల వంత చీఁక
టిని మునుంగుదు మోహన! వినుము నీదు
కీర్తి చంద్రికలిట్టులే పూర్తి వెలుఁగు
ననెడు చందానఁ జంద్రోదయంబునయ్యె. 155

తే॥ విశ్వపతి చిత్తమునఁ దప్ప విశ్వమెల్లఁ
జిమ్మ చీఁకట్లు తెగి, ప్రకాశమ్ము లోదవె
మోహనుఁడు తండ్రి చిత్తసహాస్మహ మెఱిఁగి
చదువు నేర్వంగ నెటకేనిఁ జనఁగఁ దలఁచె. 156

పంచచామరము:—ఘనంబుగన్ విశాలమా జగంబు నన్నిరీతిగన్
మనంబులుల్లసిల్లఁగన్ సుపాలనంబు సేయుచున్
దినంబు సజ్జనంబులెల్లదే జరిల్లనీతితోన్

దనంత దాను నీశుఁడొప్పు ధర్మరక్షసేయుచున్

భుజంగప్రయాతము:—హరీ! పాప హారీ! మురారీ! ముకుందా!
ధరన్మాన వాళిన్, విధానంపుఁద్రోవల్,
పరీక్షించి కావన్ ప్రభావంబు లేదా,
స్థిరంబౌ సుఖంబీయఁ జింతింపరాదా. 158

మాలిని:—వికచ కమలచక్షు న్వీతరాగు, న్విమోహున్
సకల భువనరక్షా సంతతోల్లాస భాసున్
చకిత సుజన భీతిస్ఫార నిర్మూల నాథ్యున్
ప్రకటిత గుణధామున్ స్వామిరామున్ భజింతున్ 159

గద్యము:—ఇది శ్రీభారద్వాజ గోత్ర పవిత్రాపస్తంబ సూత్ర రాఘు
వాచార్య ద్వితీయతనూజ, శ్రీరామచంద్ర కరుణాకటాక్ష
లబ్ధకవితా విస్ఫురణ, కాంఢూరు నరసింహాచార్య ప్రణీతం
బైన మోహాన విజయంబునందు ప్రథమాశ్వాసము.

—: సంపూర్ణము. :—





—‡ శ్రీ రామ చంద్ర పరబ్రహ్మణేనమః ‡—

శ్రీ

# మోహాన విజయము.

## (సాంఘిక ప్రబంధము.)

### ద్వితీయాశ్వాసము



క॥ శ్రీకరమై చెలువొందఁగఁ
ప్రాకటముగ సుఖములొసఁగు పరమాత్ముఁడు, శ్రీ
సాకేత నిలయుఁడగు నా
రాకేందు ముఖాభిరాము రాముందలఁతున్. 1

ఉ॥ ఒక్కఁడు గూరుచుండి, తన యుత్కట భావము పూర్తి సేతకై
చక్కని దారిఁ జూపి ననుఁ జయ్యనఁ బ్రోవుమ యంచు మోహానుం
డెక్కఁడు భక్తిమైఁ దలఁచు చెల్లపు డుల్లమునందు నిల్పఁగా
మక్కువఁ బద్మనాభుఁ డొక మార్గముఁ జూపఁగ నుల్లసిల్లుచున్.

ఉ॥ శారదవేళ శీతకరు చంద్రిక తెల్లడఁ బర్వ రాత్రి వి
ద్యారతుఁడైన మోహనుఁడు తల్లికి నిశ్చయమెల్లఁ దెల్పి నే
పారకుమమ్మ! నీవనుచు సారెకు సమ్మతిఁగొల్పి తాను సం
సారవిరక్తుఁడై వెడలు సాహసి చాడ్పున నిల్లు వీడఁగన్. ౩

సూర్యోదయ వర్ణనము

ఉ॥ "మోహనుఁ డెందొ యేగెడిని మూర్ఖుఁడు తండ్రికిఁ దెల్పకుండఁ,
దా-నూహ యొనర్పఁడో, వెతలనొంద విరించి తలన్ లిఖించెనో
యీహతబుద్ధి విశ్వపతి కేఁగి నచింపరె మిత్రులార! బల్
సాహసమేలనో" యనెడి చాడ్పునఁ బక్షులు కూయసాఁగఁగన్.

చ॥ "అరువఁగనేల మీరలిటు లార్యుఁడు మోహనుఁ డేమిసేసె మీ
రెఱిఁగితిరే మనంబులను, "నేరును జీఁకటిఁ జెల్లరం"చు, నీ
చిఱుతఁడు చీఁకటి న్విడువఁ జెల్లు నెపెల్లుగ గోలసేయు" నం
చరుణముఖ ద్యుతింగసరు నట్లుగ నయ్యరుణోదయంబుగాన్.

ఉ॥ బంగరుబంతియో, కడఁగిపన్నిన జేగురు పూలబంతియో,
రంగులనీను వజ్రమణి రాజమొ, లోక ప్రజా సుఖంబులన్
భంగముసేయు పాతకుల భంగముఁ దెల్పుప్రతిజ్ఞయో, యనన్
రంగుగఁ దూర్పుకొండపయి రంజిలె సూర్యుఁడు రాగమూర్తియై.

ఉ॥ బల్లునఁ దెల్లవాఱెఁ, బనిపాటల కేగ జనౌఘమెల్ల, సం
ధిల్లఁగఁ జిత్తతాపము, విధిం దలపోసెను దల్లి, మోహనుం
డిల్లు పరిత్యజించి యెట కేగెనో యంచు జనంబు తెల్పఁగా
నుల్లసిలంగ విశ్వపతి, "ఊఁ, మఱివచ్చునులే", యనిపల్కెనోర్పుతోన్

## పౌరులు విశ్వాసకుని నిందించుట

ఉ॥ ఎక్కడి నిర్ఘృణుండో, ధరనింతటి పాపి యునుండునొక్కొ, యా
చక్కని ముద్దు పుత్రకుఁడు చయ్యన నేఁగె నటంచుఁ దెల్పఁ దా
నక్కటికంబు నుంతయును నక్కట! చూపఁడ చూచు వారికిన్
వెక్కసితంబులౌ వెతలు వెల్లుగ నల్లుకొనంగ వింతయా. 8

చ॥ కుడువఁగ లేదె యీతనికిఁ గొంపలుతీసి గడించు విత్తముల్
కడువడిఁ గొండలై పెరుగఁ గడ్డను వాయినిఁ గట్టి క్రుంగెడున్
గొడుకొకఁడున్న వానిపయిఁ గూర్మిఁ దలంపక కొట్టి తిట్టి యిల్
వెడలఁగఁ జేసె నీతని వివేక మదేమని యెంచనొకటా. 9

క॥ అని యాపట్టణ మందలి
జనులెల్లరు బొక్కి పొక్కి చర్చింపఁగ నా
కనికరము లేని జనకుఁడు
ముని ముచ్చును బోలె మౌన ముద్ర వహించున్. 10

ఆ॥ వె॥ కొడుకు కానరాక కడచినఁ బదినాళ్ల
దేమియంచు మదిని నెంచఁడయ్యె
భార్యనైనఁ గాని పలుకరింపఁడ నాని
కొఱకు దిగులు లేదు కొయ్యమతము. 11

## మోహనుఁడు విద్యాభ్యాసమునకై కాశి కరుగుట

ఉ॥ తల్లినివీడి మోహనుఁడు దైవపరుండయి సజ్జనావళిన్
మెల్లఁగఁ జేరి రైలునుపయి మిత్రుల సాయము ప్రోత్సహింపఁ దా

నుల్లమునందుఁ గోరు పురమొప్పఁగఁ జేరె దినత్రయంబునన్
జెల్లుగ దైవయోగ మది పిల్వఁగఁ బోవక నిల్వ సాధ్యమే. 12

తే॥ మునిజనోల్లాసి సజ్జన ఘన విభాసి
దీప్త పాప వినాశి సతీర్థరాశి
యతులమోక్ష నివాసి విద్యావిలాసి
వాసిగను మోహనుఁడు సేరె వారణాసి 13

సీ॥ విమల గంగానది విహరించు నెచ్చోటఁ
పుణ్యతీర్థ చయంబు పొలుచు నెచట
బ్రహ్మర్షి సంఘముల్ ప్రబలును నెచ్చోటఁ
బండిత సమితులు పరఁగు నెచట
మనువ్యాస ప్రముఖులు మునులుండి రెచ్చోట
సాహిత్య శాస్త్రముల్ సాగునెచట
హైందవ విశ్వ విద్యాలయం బెచ్చోట
వరలు చుండును నిష్ఠ వర్ధనముగ

తే॥ అన్నపూర్ణయు విశ్వేశుఁ డడరునెచట
భక్త కోటికి శాశ్వత ముక్తి యెచట
నట్టిపున్నెంపు రాశిఁ బ్రఖ్యాత కాశి
మోహనుఁడు విద్దెఁ గఱవంగ బుద్ధి నిలిపె 14

సీ॥ పెద్దలఁ బొడఁగన్న నొద్దిక దఱికేగి
వినయంబు భయ భక్తులొనర నెఱగు
బాలుఁడ! యేమంచుఁ బలుకరించఁగ వారు
తన వృత్త మంతయుఁ దద్దఁ దెలుపు

నేమి కావలయునంచెఱుఁగఁ గోరఁగఁ డన్నుఁ
జదివించుమని దీను సరణి నడుగు
“చాలవు నీవిటఁ జదువు నేర్వఁగఁ బొమ్ము
బాఁలుడ” వని పల్కఁ జాలనేర్చుఁ.

తే॥ దుడకు నొక దీన పోషణు మదికి నచ్చఁ
తెలివి గలవాఁడు వీఁడని తలఁచి, తనదు
గృహమునకుఁ బిల్చుకొని పోయి యిరవుఁజూపి
చదువుఁ గఱపింప సమకట్టె సాధు వతఁడు. 15

చ॥ అరయ నహర్ముఖోత్థ పవనాంకురముల్ పయి సోఁకువేళ సం
బరమున లేచి నిష్ఠమెయిఁ బావనగాంగ జలంబులందు స
త్వరముగఁ దానమాడి పరమాత్ముని విశ్వపతిన్ భజించి తా
నిరవున కేగుదెంచి దిన కృత్యములందుఁ బ్రవృత్తుఁడయ్యెడన్.

మ॥ పరఁగం బండితు లొక్క రొక్కరు మహాప్రజ్ఞందగన్నేర్ప వాఁ
డురయం బొప్పఁగఁ గావ్యపద్ధతి నిరూఢుండౌచు శాస్త్రంబులన్
గఱచెన్, సంస్కృత మాంగ్ల భాషయుఁ, దగంగంభీర భావంబు,
ముం-దరిజన్మంబునసంస్కృతుల్ దవిలిమోదం బొప్పవెన్నంటఁగన్

మోహనుని విద్యాభ్యాస క్రమము.

క॥ విశ్రాంతి దొరకు పట్టున
న శ్రాంతము దేశ గౌర వాస్పద మగు న
ట్లు శ్రేయోదాయకము, వె
స శ్రీకరమగు, పనులను జరుపఁ దలఁచుచున్. 18

సీ॥ ఒకచోట నొకనాఁడు సఖులఁ గూడఁగఁ బోయి
శాస్త్రవాదము సల్పుఁ జతురుఁడగుచు
నొకచోట నొకనాఁడు సుకవీంద్రకావ్యముల్
పరికించి రసపుష్టి నరయుచుండు
నొకచోట నొకనాఁడు సైకత స్థలిఁజేరి
భౌగోళిక విభూతిఁ బ్రజ్ఞ నరయు,
నొకచోట నొకనాఁడ శోకుఁడాదిగఁగల్గు
నాయక చరితల నయము తెఱుఁగు.

తే॥ గంగయొడ్డున నొకనాఁడు కడుముదమున
సృష్టి వైచిత్ర్యముల మీఁద దృష్టి నిలుపు
నొక్కని మసంబు నేనియు నూరకుండి
వ్యర్థముగఁ బోవనీఁడు విద్యార్థివేళ. 19

ఉ॥ ఒంటిగ సైకత స్థలుల నొప్పఁగ నున్నపు డుల్లమందునన్
గంటికిఁ గానవచ్చు నధికంబగు పర్వత పంక్తి, సంద్రముల్,
మింట వెలుంగు మేఘముల, మేయఖగోళ గ్రహ ప్రచార, మా
వెంట విచిత్ర సృష్టిఁ, దగఁ బేర్చిన వేఁడుకఁ జింతసేసెడున్.

ఉ॥ భాను నిభ ప్రతాప పరిపాలన దక్షుఁడు, సృష్టికర్త, యీ
మానిత లోక మంతటికి మాన్యుఁడు పంకజనాభుఁడే సుమీ,
తాను నిమిత్త మాత్రుఁడని తల్పఁడు మూఢుఁడు జ్ఞానహీనుఁడై
మానవుఁడెంతపాటియగు, మాయలబొమ్మయ, యంచు నెంచెడున్

మ॥ అని యీరీతి మనస్తరంగములలో నానందపుం బోటులన్
ఘనమౌ తెడ్డులనంగ నూహలు, మహాగంభీర భావంబులున్

దనరన్, బండిత బోధ్యమానమగు బోధల్ దీపికల్గాఁగ, మో
హనుఁడుం దాటెమహాంధకార యుతమౌ నజ్ఞాన వారాంనిధిన్.

చ॥ ఇరువది రెండు వర్షముల యీడున మోహనుఁడింపెసంగ, సా
దరముగఁ బోషకుండగు విధంబున వీడ్కొని, పండితాళికిన్
బరఁగఁ గృతజ్ఞత ద్దెలిపి, ప్రాజ్ఞులు మెచ్చఁగ నిశ్చయించెఁ, దా
నరుగఁగ దేశముల్దిరుగు నాస కడుంగడుఁ బ్రోత్సహింపఁగన్.

క॥ అందితి, బి. ఏ. పట్టము
నందితి సంస్కృతము నాంగ్లమందున బిరుదుల్
పొందిన పేరుల వన్నియు
నందములగు లోకగతిని నరసిన యపుడే. 24

ఉ॥ పొందఁగ వచ్చుఁ బట్టములు, పొల్పుగ బిర్దులనందవచ్చు, నిం
పొందఁగ సత్ప్రవృత్తులయి యుండినఁగాని ఫలింపవవ్వి, యే
మందురు లెమ్ము లోకులని యాత్మకు నీతికి బాహ్యులైన వా
రిందును నందు సాక్ష్యముల నిచ్చుకొనందగి యుందు రక్కటా!

మోహనుని దేశ సంచారము.

తే॥ అంచునటనుండి కాశ్మీర మరిగె, నందుఁ
గొంత కాలంబుఁ గడఁపగఁ గూర్మిగలిగి,
దేశమందున శృంగార రాశియనఁగ
దెసల బొగడొందుఁ గాశ్మీరదేశమిలను. 26

మ॥ చని కాశ్మీరమునందు మోహనుఁడొగిన్ సన్మిత్రులొప్పారఁ, దాఁ

గనియెన్ శ్రీపురి రాజధాని, నచటం గాంక్షించి కొన్నాళ్లు ని
ల్వను బుద్ధిం దలపోయ, శ్రీహరి యనం బ్రఖ్యాతుఁడౌ మిత్రుఁడా
తని నింపొందగ నింటనిల్పుకొనియెం ధన్యుండనంచెంచఁగన్. 27

చ॥ సిరులకు నాటపట్టు, కడుఁ జెల్వుల తోఁపు, సుఖాలవాల, మా
కరము కళా చమత్కృతికిఁ, గాంచన గర్భ సతీనివాస, మ
ప్సరలను మించు నింతులకుఁ జారు తరంబగు బుట్టినిల్లు, కా
శ్మీరము, జగంబునం బొగడ శేషుఁడు చాలఁడనంగ నొప్పెడిన్.

తే॥ రాగ మొదవించు నేరికే రాజ్యరమణి
గాని కాశ్మీర రమఁగన్నఁ గనులు బ్రమియుఁ,
దక్షిమి యిటునటు నలయింప ధర్మ గతియె?
తగవు లాడిన దీర్పరుల్ ధరణి నరిది. 29

ఉ॥ పుట్టిర యొక్కగర్భమున, మొన్నఁటి నిన్నఁటి దాఁక మైత్రిచే
నెట్టివిభేద భావముల నెంచక, నేయొక రాజ్యలక్ష్మికై
కట్టడ వీడి, దుర్జనులు కయ్యములం బురికొల్పి నవ్వ, ని
ప్పట్టున నన్నదమ్ములకుఁ బాపి విరోధము చెల్లునే ధరన్. 30

తే॥ తమకు నచ్చిన నొండొరుల్ తవిలియుంట,
లేకయుండిన, విడిపోయి వేఁక నుంట,
చెల్లునంతియ, కలహముల్ చెల్లునె కట!
తల్లి యెట్లోర్చుఁ దనయులు తగులు పడఁగ. 31

మోహన సుశీలల చెలిమి.

ఉ॥ శ్రీహరి కొక్కచెల్లెలు, సుశీల, వయోగుణ రూప విద్యలున్,
సాహసమొల్కు చాతురియుఁ, జక్కని శీలము గల్గుకన్య, సం

దేహములేదు చెల్వమున దీటుగ నచ్చర లేమయే యగున్
మోహనుఁడప్పుడా యువతి ముచ్చటఁ దీర్పఁగఁ బ్రొద్దుపుచ్చెడిన్

చ॥ బిరబిర మోహనుండడరువేఁడుకఁ బ్రొద్దునఁదీర్చి కాల్యముల్,
కరమునఁ బత్రికం గొని, వికాసముతోఁ బఠియించుచుండఁగా,
సరస విలాసముల్దనరఁ జక్కఁగఁదీరిచి మేని సొంపు నా
యరితి సుశీల యచ్చటికి హాజరు కాఫీ యొసంగు నేర్పునన్ 33

చ॥ సరసను నిల్చి కొంతవడిఁ, జయ్యనఁ బత్రిక లాగి, చూడుమీ
వరుసకు నర్థమేమనుచు, వాలక మొప్ప హసించి, పల్కె "నే
నరిగెద నేమికావలయు నారయ కాఫియయేమొ" యంచు నా
వరుస విలాసముల్నెఱపు, వారిజలోచన చూపు భావముల్.

తే॥ భోజనంబిడఁ దామున్నె పూన్కిఁజూపుఁ
బిలిచి నట్టుల నెలమిమైఁ బలుకరించు
మోముఁ జూచిన యంతనె మురిసినవ్వు
వెనుక ముందఱఁ దానయై మెఱయుఁ జెలువ, 35

ఉ॥ మాటల తళ్కు బెళ్కులును, మంచితనంబు, విలాస చేష్టలున్
సూటిగఁ బృచ్ఛసేయుటలు, చూడ్కుల సొంపులు, చూడఁ జూ
డన-ప్పాటల గంధిభావములు, భావజులాస్యము లౌనుఁగాని, యె
ప్పాటను నమ్మ మోహనుఁడు భామిని చిత్తమెఱుంగ శక్యమే.

తే॥ దిన దినంబును నీరీతిఁ దనరు చుంట
నిరువురకు భావ కుసుమముల్ విరిసి యొప్పఁ
జిత్తజుని మోహనాస్త్రంబు తత్తఱింపఁ
గొలఁది దినముల మనములఁ జెలిమి యొసఁగె. 37

సీ॥ లలిత పుష్ప వితాన రాజితోపవనంబు
లందు విహారముల్ పొందు పడఁగఁ,
బాయతలై మెలికలై పర్వతంబులఁబాఱు
సెలయేటి విందులు చెలువొసంగఁ,
దత శరచ్చంద్రికా శ్రిత సైకతస్థలిఁ
మధుర గాన వినోద విధులు పొఁనగఁ,
జిత్రకళల్ పొంగు సినిమాల కరుగుటఁ
జిత్త జ భావముల్ చెంగలింప.

తే॥ జవ్వనపు టూయెలల నూఁగు జతనుఁగాంచి,
చిలుక గోర్వంకలని యెదఁ దలఁచు చుండ,
మోహన సుశీల లెలమిమైఁ బొదలిరపుడు
పడుచుఁ దనముల నిష్యంధ పఱుపఁ దఱమె? 38

ఉ॥ అక్కడ మోహనుండు తనయక్కఱ కెక్కుడు గారవంబు పెం
పెక్కిన భోగముల్ దనర నింపుగఁ గొన్ని నెలల్వసించి తా
నిక్కపు ధీరుఁడౌ కతన నిశ్చితకార్య నిరూఢ బుద్ధిచేఁ
దక్కక దేశ సంచరణ ధర్మ సమాచర ణైకదీక్షమె. 39

ఉ॥ శ్రీహరికిఁ సుశీలకును జెప్పి ప్రయాణము నిశ్చయింప స
మ్మోహన మంత్రమట్టుల విమూఢ నొనర్ప సుశీల నప్పుడా
మోహనుఁడొప్పు కోల్గఱపి మోహిని! చింతఁదొఱంగు మంచున
వ్యాహతి వీడు కోల్వడసి యాత్రకు నప్పురి వీడె వేడ్కతోన్.

మోహనుని దేశ సంచారము—హిమాలయ వర్ణనము.

మ॥ కనియెఁ శృంగ విచుంబితాంబరము, గంగాపూత మూర్ధంబు న

న్మని సేవ్యంబు విలాసధామము సురల్ భోగింపఁ గ్రీడింపఁ, బె
ట్టని కోటల్ బలె హైందవాననికి దిట్టంబౌచుఁ, బూర్వాపరా
వని యెల్లల్ గురుతించు కోల, యన స్వత్వంబైన శీతాద్రినిన్.

చ॥ ఘనతర కందరావళి ప్రకాశిత సాను చరద్ద్విపేంద్ర వా
హన జలదోపరి స్థల విహాసి హిమాని సితాత పత్రమై
తనరఁ, విహంగనాద జనితార్భటి వంది జనోప గీతిగాఁ,
జనును నగాధిరాజనెడు శబ్దము భూధర! నీకె యిద్ధరన్ 42

ఉ॥ యుక్తిప్రయుక్తులం దవిలి యున్నతిఁ గన్గొనఁ బూని, పైకి నా
సక్తతఁ బోయి పోయి గురు శంకర శృంగముఁ జేరలేక వే
ముక్తికి దారిఁబట్టుమురు ముగ్ధ ప్రతీచ్యులు నేఁటిదాఁక, నీ
శక్తి యెఱుంగమానవులు చాలుదురే యిల శీతశైలమా! 43

ఉ॥ పుట్టినయిల్లు పార్వతికిఁ, బూజ్యతపోధనులున్న చోటు, తా
మెట్టిన తావు శంకరుడు, మేటి నరుండును నారణుండునుం
బట్టి చరింపఁ బూతపద పంక్తి విచిత్రిత పాదభూమి, యీ
గట్టులరాయఁడీ, తనిని గణ్యుచుతింపగ శక్యమే యిలన్. 44

సీ॥ చలిమల యొడియందుఁ జల్లఁగ వికసించి
లలితమై పరఁగు సిమ్లా వెలుంగ,
వ్యాపార రంగమై యేపారుటను జేసి
లాహోరు నగరంబు రమణ నొప్ప
సిక్కులు కడుభక్తిఁ జెలఁగి యాత్రలు సల్పు
నమృత సరంబది యలరుచుండఁ
బాదల జీలము దొట్టి నదులైదు, పొలముల

గోధుమ పంటల గుట్టలసెర.

తే॥ సారవా భూములను సాగు సాగుచుండఁ
గడుపులోఁ జల్ల ప్రజలకుఁ గదలకుండఁ
దూర్పు పంజాబు రాష్ట్రంబు తొంగలింప
మోహనుండంతఁ జరియించి ముదమునందె. 45

ఉ॥ తొల్లియుధిష్ఠిరుండెచట దోర్బలమొప్పఁగఁ బాలనంబు భా
సిల్లఁగఁ జేసె, నెద్ది పరరాజుల చిత్తము మెచ్చుపేడు నేఁ
డెల్ల స్వారాజ్య కార్యముల కెయ్యది కేంద్రము నందమైన యా
ఢిల్లి పురంబు నందుఁ గని, డెందమునం బరికించెఁ బ్రోలిమేల్.

సీ॥ అతిలోక సుందరమగు తాజ్మహల్ మించ
నాగ్రా పురంబు నందంబు గొలుపఁ
జర్మ పరిశ్రమల్ చాలఁగ రైల్వకూ
డలి యాచుఁ గాన్పూరు వెలయుచుండ
గంగయు యమునయు సంగమించు ప్రయాగ
దీర్థ యాత్రలు వేడ్కఁ దేజరిలఁగ
రాణించు నలహాబాద్ రాజధానియు నొప్పఁ
బురవరంబులు తీర్థ పూతములయి
తే॥ వారణాసియు లక్నోయు వరలుచుండ,
గంగ యమునయు గోగ్రయు గండకీ త
పత్యాపగలు నిత్య సంపదల్ పరపుచుండ
రాణ యొుప్పారు సంయుక్త రాష్ట్రముఁగని. 47

వ॥ అందు విశేషించి బదరీ నారాయణ క్షేత్రసందర్శ నోత్సుకుండై

యరిగి తత్రత్య దివ్యమంగళ విగ్రహ నిరీక్షణ పరిపూతాత్మ విగ్రహుండగుచు, నంతట బదరి కాశ్రమంబును, హరి ద్వారంబును, సాలగ్రామ పర్వతంబును, నయోధ్యయు, నైమి శారణ్యంబును, గురుక్షేత్రంబును, సేవించి, రాష్ట్రంబంతయుఁ గలయఁజూడఁగోరి.

ఆ॥ వె॥ సంచరించి యందు నంచితంబుగ మోహ
నుండు విషయములను దండి తెలిసి
యరిగె నచటనుండి యవ్వలి రాష్ట్రంబుఁ
జూడఁగోరి మెకను సొంపుగలుక. 49

వ॥ నిర్ఝర తరంగిణీ తట విలసితంబును, శాలి సస్య సముల్లసితంబును, రాజధానియు, నగు పాట్నానగరంబును, ననేకముఖ యాతాయాత ధూమ శకట పరివర్తన సంధిస్థానంబును తాతాయః వరిశ్రమ సంస్థా నిలయంబునగు జంషద్ పురంబును జీవ కారుణ్యబోధకుండైన బుద్ధభగవానుని బుద్ధ్యుత్తేజకంబగు బోధి వృక్షంబు వెలయు పవిత్ర గయా క్షేత్రంబును నెద్దానికి వన్నెఁదెచ్చునట్టి బీహారు రాష్ట్రంబును సందర్శించి యనంతరంబ. 50

ఉ॥ ఉత్తమ పత్తనంబులను నుత్తమమై రమణీయమౌచు సం
పత్తికిఁ దావలంబయి యపార నిధుల్ విలసిల్లుచుండఁ జి
త్రోత్తుగ గంగయంత్యమున నుజ్జ్వల హుగ్లి నదిక్ వెలుంగు కల్
కత్త పురంబు మోహనుఁడుగన్గొని యచ్చెరు వందె నాత్మలోన్

తే॥ వార్ధి ముఖమందు నయ్యది వరలుచుండు
మొనసి పడమటి బంగాళమునకు రేవు
జనుప పంటకు వరిపంట కనయ మిరవు

ఘనులు ధీరులు సద్బుధుల్ గలుగుతావు. 52

వ॥ అనంతరం బచ్చటినుండి కదలి దర్శనీయంబులగు బ్రహ్మ పుత్రా
సువర్ణనదులు పాల్పొందఁ, దేయాకు పంటలకుఁ బ్రఖ్యాతంబైన
షిల్లాంగు నగరంబు రాజధానియై విరాజిల్లఁ గరంబలరారు నస్సా
ము రాష్ట్రంబును, సర్వదా శాలిసస్య విభాసితంబై, యభేద
ప్రతిపత్తి బోధకంబును, నఖిలమనోరథ పూరకంబునగు పూరీ
జగన్నాథ పుణ్యక్షేత్ర దర్శనీయంబై కటక రాజధానియై విలసిల్లు
నొరిస్సారాష్ట్రంబును, సవిలాసంబుగ దర్శించి పదపడి. 53

చ॥ బనరఁగ దివ్యదేశములు, నొప్పఁగఁ బావన పుణ్యతీర్థముల్,
తనరఁగ మేల్పురంబులును, దాక్షిని వింధ్యకు దక్షినంబునం,
దెనయు పవిత్ర వాహినులు నెక్కుడు పర్వత పంక్తు, లొప్పఁ దాఁ
గనియె సుదీర్ఘ రాగ మెద గాటముగాఁగను జెన్నరాష్ట్రమున్.

ఉ॥ అందు విశాఖ పట్టణమునందున నౌకలరేవుఁ జూచి, యా
నందముతోడ నట్టులనె యారసి మెచ్చుగఁ గాకినాడ, వె
ల్గొందెడు చెన్నపట్టణము కుంఠితదీక్షఁ బురాతనంబులం
దంద పురంబులన్ మధుర, నంచితమా బెజవాడఁ గాంచుచున్.

సీ॥ ప్రియమైన కావేరి కృష్ణ గోదావరుల్
తుంగ భద్రానది తొంగలింప
రంగారు కాంచి శ్రీరంగంబు తిరుపతి
మూర్తుల హోబలమూర్తి వెలుఁగఁ
జెలఁగు ద్రాక్షారామ శ్రీశైలకాళహ
స్తీశులు రామ లింగేశుఁడలరఁ

జలువకు నిలయమై సన్నుతింపఁగఁజాలు
మేలిమి కొడైకనాల్ నీలగిరులు.

తే॥ చెలువొసంగఁగఁ జెన్నొందు చెన్నరాష్ట్ర
మందుఁ జరియించి యందలి యతిశయంబుఁ
జూచి మెట్టూరి ప్రాజక్టు సొంపునరసి
వెడలె రాయలసీమకు వేడ్కఁగదురి. 56

సీ॥ అతుల హైందవ తేజమలరారు శ్రీకృష్ణ
దేవరాయ విభూతి దేజరిలఁగ
శిథిలమై యలనాఁటి చిన్నలు దఱుఁగక
వెలయు హంపీక్షేత్ర విజయనగర
మల గండికోట యత్యంత వైభవమంద
లలినొప్పఁగంది మల్లయ్యపల్లె
పోతనార్యప్రజ్ఞఁ బూతంబుఁ గావించు
నొంటిమిట్టయు ఖ్యాతినొంది యడర.

తే॥ వెసఁగుముద్యాతి పాపఘ్ని పెన్నలలర
నెసఁగు శేషాద్రి శ్రీశైలమింపుఁ గొలుప
రాయలేలిన రాజ్యమైరం జెలంగఁ
బొలుచు రాయలసీమఁ బెంపొప్పఁజూచి. 57

వ॥ తిరువనంతపురము రాజధానిగానొప్పు తిరువాన్కూరు సంస్థాన ప్రాంతంబునఁ గొచ్చిన్ పురంబును, పెరియారునది యానకట్టయు గాంచి, పదంపడి యత్యంత సుందరంబులగు మైసూరుపురంబును బెంగళూరు నగరంబును, బంగారుగనుల కాకరంబగు కోలారు

ప్రదేశంబును, నుభయ కావేరీమధ్య రంజిల్లు శ్రీరంగ పట్టణ క్షేత్రంబును సేవించి, యక్కడినుండి బయల్వెడలి హైదరాబాదు సంస్థానంబున నవాబుల నిలయంబగు హైదరాబాదు పురవరంబును, సైనిక స్థావరంబగు సికిందరాబాదును, చారిత్రక ప్రసిద్ధంబులగు ఒరంగల్, గోల్కొండ, గుల్బర్గా, ప్రదేశంబులను, ఆర్యనాగరకతా ప్రకాశకంబులగు ఎల్లోరా, అజంతా గుహలను, సమీక్షించి, కృష్ణా గోదావరులు ముదంబుఁగొలుప నత్యానంద భరితుండై యనంతరంబ. 58

ఉ॥ స్థాయి విశాల కార్మికపు సంస్థలకెల్ల, విలాసి మానవా
ప్యాయి, మనోహరంపుటురు పట్టణరాజము, సౌఖ్యదాయి, య
త్యాయత భారతావనికి ద్వారము నౌకల రేవుపట్టు, బొం
బాయి పురంబు మోహనుఁడు పాయవిధాయి కనెన్ముదంబునన్.

తే॥ వింధ్యపర్వత దక్షిణోర్వీతలంబు
నందు నిరవొందు నెయ్యది యందమగుచుఁ
గృష్ణ గోదావరులకుఁ బుట్టిల్లు గాఁగఁ
బరఁగు బొంబాయి రాష్ట్రంబుఁ దఱమె పొగడ. 60

ఉ॥ ధీరుఁడు ధర్మపాలకుఁడు, దీర్ణ ప్రతిజ్ఞుఁడు, వారి రాశి గం
భీరుఁడు హైందవుల్ పొగడ భీకరమూర్తి శివాజి యావనుల్
ధారుణిఁ జిక్కఁబట్టుకొని దైత్యుల భంగిఁ బ్రవర్తిలంగ ని
ర్ధారిత దీక్షమై గెలిచి రాజ్యము నిల్పిన యట్టి రాష్ట్రమా. 61

వ॥ అందు రైళ్ల కూడలియై చారిత్రక ప్రసిద్ధంబగు పూనాపట్టణంబును బరిశ్రమలకును గర్మాగారములకును నిలయంబైన యహమ

దాబాదు నగరంబును, మహాబలేశ్వర, పండరీపుర దివ్యక్షేత్రంబులను సందర్శించి యంతట. 62

చ॥ అవని వడంక హైందవుల నందఱ నొక్కట మట్టుపెట్టి, తా
మె, వనధి పర్వతావృత సమీకృత రాజ్యము లేలఁగోర, నా
యవనుల నక్బరాదులను నార్యవిరోధులఁ గీటడంచి పా
ర్థివులు నృసింహులేలి తగఁ దీర్చిన రాజపుటాన మందునన్. 63

సీ॥ ఆరావళీ పర్వతా వృతంబయి యొప్పు
నుదయసింహుండేలు నుదయపురము
వితతారి వర్గంబు ప్రీల్చి చెండాడిన
జయ సింహుఁడేలిన జయపురంబు
యవన మత్తగజంబులడఁచు సింగంబులై
యోధ రాణలు పొల్చు జోధపురము
రసపుత్రవీరు లింపెసఁ గంగ నిరవొందు
చిత్తూరు దుర్గంబు చెలఁగుచోటు.

తే॥ తవిలి వెన్నంటి రాణా ప్రతాప సింహుఁ
డడరి శత్రుభయంకరుఁడైన చోటు
పొలుచు రాజ పుటానంబు పొలుపుఁగాంచి
సంతసించుచు నంతట సంచరించె. 64

వ॥ ఇవ్విధంబున మోహనుండుత్తరంబున హిమవన్నగంబుచేతను ప్రాక్ప్రతీచీ దక్షిణంబులను దధిచేతను నావృతంబై యార్యావర్తంబను నుత్తర హిందూస్థానంబును వింధ్యంబునకు దక్షిణంబున దక్షిణ హిందూస్థానంబును "ఇండియన్ యూనియన్" అనంబ

రఁగు దానిని సాకల్యంబుగ సంచరించి, సంప్రాప్త విశేష ప్రజ్ఞుం డగుచు సంతసించి, తన జనకు నింటి కరుగంగోరి, యొకటి రెండు దినంబులు బొంబాయి నగరంబున విశ్రమింపందలంచి, యందు నిలిచి. 65

కం|| ఒక్కదినంబున మోహనుఁ
డక్కజమగు వేడ్కయడర, నంబుధి తటమున్
జక్కఁగఁ జేరి యొకండ ట
మక్కువ జలరాశిఁ గూర్చి మది నిటుదలఁచెన్. 66

—: సముద్ర వర్ణనము :—

ఉ|| తోరములైన సంపదలఁ దూగెద వంచెవఁడేని, నిన్ను నే
పారఁగ నాశ్రయింపఁ, దగ వానికి నీరము నీయలేవ హా!
బారుగ సంపదల్పొదలు పాపికి లోభగుణంబు మాడ్కి నీ
క్షార గుణంబు నీకమరె సాగర! కర్మ ఫలంబదేమిటో. 67

ఉ|| పారములేదు చూడఁగ, నపార తరంగ కరప్రచారముల్,
ఘోరున మ్రోఁగుటల్, పుడమిఁ బొర్లుచు నుర్గులఁ గ్రక్కుచుండు
టల్-సారెకు లేచుచుంబడుట, సాగర! నీగతిఁ జూడఁగా, నప
స్మార రుజాప్ర పీడితుని చందము నీయెడఁ గాంచనయ్యెడిన్. 68

ఆ|| వె|| గొప్పతనముఁ జూచి కోరి డగ్గఱఁజేరి
యప్పు బట్టఁగ వాని నట్టె కూల్తు
వప్పుఁ గొనిన వాని నఱిముఱి పఱచుచుఁ
బట్టి పీల్చు ధనికు పగిదిఁ దోఁప. 69

ఆ|| వె|| ఎట్టివాఁడవైన గట్టిగ నినుఁ గొల్వఁ

గారణంబొకండు గలదు జగతి
రత్నరాసులడర రాజించు ఘనుఁడవు
జలచరాళి చేతఁ జెలఁగుమూర్తి. 70

చ॥ వితత మహోదధి స్థలము వీడుచు మోహనుఁడింటికేగుచున్
వ్రతమది పూర్తియయ్యె, నిఁక మాపురికేగుట మంచిదంచు, స
మ్మతముగ నిశ్చయించుకొని, మాతకుఁ, దండ్రికి, మిత్రకోటికిన్,
సతతశుభస్థితిం దెలుపఁ జయ్యన లేఖలు వ్రాసె నివ్విధిన్. 71

ఉ॥ శ్రీయుతులైన మిత్రులకు, శ్రీమతి తల్లికిఁ, దండ్రిగారికిన్,
వ్రాయుఁ గుమార మోహనుఁడు, వచ్చెద నింటికి నెల్లినేను మీ
కీ యువకుండు లేఖలను నింతకుఁ బూర్వము వ్రాయకుంటకే
మోయని యెంచఁబోకుఁ డెదబూనితినీ వ్రతమింతకాలమున్. 72

క॥ క్షమియింపుఁడు మిక్కిలి, మీ
యమిత కృపామహిమఁ జేసి యరసితి విద్యల్
మిముఁ దలఁతు నిచ్చలున్మదిఁ
దమి మీకు నమస్కరించు ధన్యుఁడు మోహన్. 73

తే॥ అనుచు లేఖలు వ్రాసి యత్యంతప్రీతి
నుత్సుకుండయి మఱునాఁటి యుదయమందు
సఖుల వీడ్కొని సంతుష్టస్వాంతుఁడగుచు
ధర్మపురిఁ జేర నరిగె దత్సమయ మెఱిఁగి. 74

ఉ॥ అక్కడఁ దల్లికిన్ సఖులకయ్యె ముదంబధికంబు, తండ్రికిన్
బెక్కు విచారముల్గలిగెఁ "బెండ్లికిఁ బిల్లల నెవ్వరిత్తురో,
మిక్కిలి నేర్చువారలకుఁ మేల్మిగఁ గట్నములీయఁ జెల్లదే,

యెక్కువ కట్నముల్ మనకు నిచ్చెదు వారినె చూతు" నన్వగన్.

తే॥ తల్లి యెన్నఁడొ విడిచిన తనయుఁడింక
నిల్లు చేరెడు ననుచు రంజిల్లెఁ గాని
తండ్రి యోచించె నివ్విధి ధనము కొఱకు
నింత కఠినాత్ముఁడుండునే పృథివి యందు? 76

తే॥ ఉత్తరము వచ్చు మఱునాఁటి యుదయమందు
మోహనుఁడు వచ్చి దిగె రైలు ముదముతోడ
మిత్రులెదురేగి కలిసిరి మెప్పులలరఁ
జెలఁగి రన్యోన్య కరములఁ గలిపికొనుచు. 77

చ॥ మతిరసికుండు మోహనుఁడు, మాటలనేర్పరి, చిన్ననాఁటి స్నే
హితులను గాంచి మోదమున హెచ్చుగ హాస్యచమత్కృతుల్
కరం-బతుల వినోదభాషలును నందఱఁ దన్పఁగ నేగె నింటికిన్
సతతము బుద్ధిశాలులకుఁ జాతురి నైజమకాదె యన్నిటన్. 78

ఉ॥ తల్లికిఁ జాగిలంబడుచు దండముపెట్టిన "దీర్ఘ మాయుర
స్త్వో"ల్ల సుఖంబులం గనుమ యీప్సిత సిద్ధియు నందుమంచు తా
నుల్ల మెలర్ప దీవనల నుచ్చిని మూర్కొని ముద్దుఁగొంచు సం
ధిల్లఁగ సంబరంబపుడు తీఱె భరంబని యెంచె నాత్మలోన్ 79

తే॥ జనకునకు మ్రొక్కనతఁడు దీవనలొసంగె
"శీఘ్రమేవ వివాహ సంసిద్ధిరస్తు"
"ఘనతరంబగు నుద్యోగ మెనయుఁ గాత"
"మనయ మర్థంబు వర్ధిల్లు ననుచు నపుడు" 80

ఉ॥ అంతట మోహనుండు జనకాంతికముం బెడ బాసి నెచ్చెలుల్

సంతత ముల్లసిల్లఁగను జయ్యన స్నానము దీర్చి, మేడపై
వింతలు వేడుకల్దనర వీనుల విందుగ ముచ్చటించె న
త్యంత వినోద వీచికల నాదినమంతయు నోలలాడుచున్. 81

చ॥ జరుగఁగఁ గొన్నినాళ్లటుల సజ్జన సంఘములందుఁ జేరుచున్
బరఁగుచు సజ్జనుండనఁగఁ, బ్రాజ్ఞుఁడు నాఁగ, విశాలభావముల్
వరలఁగఁ జూచువారలకు వహ్వాయనంగను, మోహనుండు తా
నిరతము సత్ప్రవృత్తుఁడయి నిర్మల చిత్తత నొప్పుచుండఁగన్.

చ॥ చదువరి, బుద్ధిశాలి, కడు సాధువు, జాణ, వివేకవంతుఁ డిం
పొదవు రసజ్ఞుఁ, డింగితములూహ యొనర్చెడి దిట్ట, యంచు స
మ్మదమున వాడవాడలను మాన్యులు పౌరులు వాడుకొందు రా
సదయుని "నెందు నాకృతియెసంగు గుణంబులు నందుఁబొల్చెడిన్.

ఉ॥ ధీరతఁ, గర్మశూరతయుఁ, దేజము, దిట్టతనంబుఁ, గాంచి, యా
యూరి ప్రజల్ ధరారమణి నోముఁగఁ బుట్టిన శూరుఁడంచు దు
ర్వార కుతూహలంబడర వారక తల్చిరి మానసంబులన్
వీరుఁడు "మేఁక గర్భమున బెబ్బులి పుట్టెక" యంచు నిచ్చలున్.

తే॥ కొడుకు మోహనుఁడీరీతిఁ గడపుచుంట
మనము సహియింపదయ్యె విశ్వపతికకట
కుడిచి కూర్చుండి సఖులతోఁగూడి తిరుగ
నెవఁడు పెట్టెను వీనికి నెఱుఁగఁడయ్యె. 85

తే॥ పడుచు వారలు పనులకై ప్రాఁకులాడఁ
దిండి పోతయి తిరిగెడు దిమ్మరీఁడు
కడఁగి తహసీలు దారునే నడుగరాదె

యనుచు గొణుఁగుచు నుండెఁ దానాత్మలోన. 86

—: విశ్వపతి కుమారు నుద్యోగమునకై పురికొల్పుట :—

—: మోహనుఁడుద్యోగము సేయ నిరాకరించుట. :—

—: విశ్వపతి మోహనుల సంభాషణము. :—

ఉ॥ ఒక్కదినంబు మోహనుఁడ యొక్కఁడు తాగది యందుఁ బుస్త
కం-బక్కజమైన వేఁడుకను నాదరమొప్పఁ బఠించుచుండఁగా
నుక్కివుఁడైన విశ్వపతి "యూరకయుంటివి యింటి యందు నీ
వెక్కడ నేని కొల్వుగడియించఁగఁ జూచుకొనంగఁ జెల్లదే" 87

మ॥ చదువుల్ నేర్చుట యెందుకో, వితగ సం
చారంబులంబ్రొద్దుపు
చ్చెద, వేమన్నను గస్సు బుస్సు మనుచుం
జేరంగ నెందేని యే
గుదు, యోచింతువె వెన్కముందులను, నీ
కుంబోలదీ, వేలన
మ్మెద వీ మిత్రులు గ్రితులుందుదకు నీ
మేలెంచి రక్షింతురే. 88

చ॥ అనవుడు మోహనుండనియె "నయ్య! యిదెక్కడి నీతిబోధ, నీ
ఘనతను నీవెఱుంగకయ కర్మఫలంబునఁ జేసి విత్తమం
చనయము మోహవార్ధిఁబడి యంచిత గౌరవ పద్ధతుల్ మదిం
గనుఁగొనలేక వాసి చెడి గాసిలుచుండుట ధర్మమార్గమే." 89

ఉ॥ కూటికె గుడ్డకున్ వెఱచి కుందెడివారికిఁ బ్రొఁకులాట, మీ
బోటి ధనాధికుల్వగవఁ బోలునె? తండ్రి! క్షమించు నన్ను, నా

పూటకులేని పేదలిలఁ బొక్కుచునుండఁగఁ బ్రోవఁజాలి, నా
సాటి జనంబు లడ్డుపడఁ జాలఁగనవ్వారె ధాత్రిమానవుల్. 90

చ॥ చదువులు నేర్చుటల్ ధరను జాకిరి సేఁతకె గాని మానవుల్
సదమల దివ్యబోధమున సద్గతిఁ జెందఁగఁ గాదయేమి,? మే
ల్పదవికిఁ గాని పుట్టుకలు, బానిసవృత్తులు, సంపదల్పుఖవిక్,
పదిలము గాఁగనుం జవుటి పట్టల పిత్తిన విత్తులే యగున్. 91

చ॥ పరులకు దేహమమ్ముకొని, పాటులకోర్చి, నిహీనవృత్తిఁ బం
జరమున సింగమట్లు, తన సాహసమంతయుఁ జంపుకొంచు, నే
వెరవును లేక స్వేచ్ఛకయి వేఁగుటకంటె, సతంబు సత్క్రియా
పరుఁడయి దేశసేవ సలుపందగదే ధనవద్వివేకికిన్. 92

సీ॥ అక్షరజ్ఞానంబు నలవర్చుకొనకుంట
నజ్ఞాన తిమిరంబులలమువారు
స్వార్థపరత్వముల్ సవరించుకొనకుంట
మోహకూపంబున మునుఁగువార
లికమిత్థమని తెల్పు సదయులు లేకుంట
విభ్రమాటవుల భ్రమించువారు
లంచగొండులు ఘోరవంచకుల్ పన్నంగ
బిఱికి వాగురలందు మిడుకువార.

తే॥ లెందఱెందఱో యీరీతి వందురిలఁగ
నుద్ధరింపఁగఁ జేతనై యుండి "యెవరి
గతులు వారివె" యని యున్న గరుణలేక
పద్మనాభుఁడు మెచ్చునే పాపిజనుల 93

తే॥ పరఁగ నజ్ఞాన కాననావళులఁ బుట్టు
దుష్టభావానల జ్వాలలిప్తము మెయి
దీన తరుజాలమేర్చుచుఁ దివురుచుండఁ
బ్రజ్ఞఁ జల్లార్పఁ బూనుట పనియగాదె. 94

క॥ అనుచు న్మోహనుఁడప్పుడు
తన నిశ్చయమెల్లఁ దెలుపఁ దడ పాటొదవన్
జనకుఁడు పల్కెను నిర్విధిఁ
దనపని కొనసాగుననెడి తలఁపున మదిలోన్. 96

ఉ॥ ఛీ! దురితాత్మ? నీవిటు వచించెద వంచెఱుఁగంగనైతి, నీ
వాదమె నీదిగాని యెంరుపల్కు వినందగు బుద్ధి నీయెడన్
లేదు, విచిత్రకాలము, విహీనము పెద్దల గౌరవంబు, సం
వాదములేల నాకిపుడు, మాటల నేమిఫలంబు చేకుఱున్. 96

తే॥ అద్భుతంబగు నార్భాట మడరఁ దండ్రి
యెగిరి దుమికిన మోహనుం డేమియనక
కడఁగి నా నిశ్చయంబునే విడువననియె
నిశ్చితాత్ముల మనసులు నిశ్చలములు. 97

తే॥ తండ్రియెక్కడ? వివరింపఁ దనయుఁడేడ?
హాస్య మశోకాంతరము వీరి కరయఁగలదు
ద్వైవ సంకల్పములు తల్పఁదరములగునె?
విషపుఁ జెట్టున నమృతమా విర్భవించె. 98

ఉ॥ చూచినవారు విశ్వపతి సూరెలఁజేరి ప్రసంగ ధోరణిన్
"మోచనవైన మోహనుని పెండ్లి ప్రయత్నము సేయకుంటిరే

యోచన సల్పినారొ" యనియూరిప్రజల్ చనవొప్పఁ బల్కఁ, నేఁ
జూచుచు నుంటిఁ గాని మన చూపున కందిన మన్కి రాదనన్.

ఉ॥ మించిన సద్గుణోన్నతి, యమేయ దయారతి, సత్క్రియాదృతుల్
సంచిత పుణ్యసంగతి, విశాల మనోధృతి, పొల్చు చుండ, వ్యా
పించి వెలింగె మోహనుఁడు పెల్లుగ దూరపు టెల్లలందుఁ, బు
ష్పించిన వృక్ష గంధములు వీఁచుక్రియన్ దవుదవ్వు భూములన్.

ఉ॥ కంటిమి నాయకోత్తముని గష్టము దీఱె ననంగఁ గొందఱున్,
మంటిమి దుష్టపాలకుల మాయలు మాసె ననంగ గొందఱున్,
గంటికి విందుఁ గొల్పునని కామినులుం దలపోయు చుండ, నే
జెంటులు కన్యకా వళికిఁ జెచ్చెఱఁ జేర్చిరి ఫోటో లేఖలున్. 101

సీ॥ చిన్నది.మాకన్య చెలువుల బంతియౌఁ
బదివేల నిత్తుము బాలకనుచుఁ,
జదివించితిమి చాల సంగీత భారతి
పదునైదు వేలు మాబాల కనుచు,
మాచిన్ని కన్యకు మంచి సొమ్ములు పెట్టి
యిరువది వేలైన నిత్తుమనుచు,
మాది యెస్టేటు మీమదికి మెచ్చఁగ నిత్తు
మతి కోమలాంగి బల్ చతుర యనుచు,

తే॥ నెక్కడెక్కడి నుండియో మిక్కుటముగఁ
బత్రికలు, ఫోటో ప్రతిమలు వచ్చిపడియె
వరుస వేలము పాటలు పాడినట్లు
కూఁతులను గన్న తండ్రుల గోడు గనుఁడు. 102

ఉ॥ పొందుగ నెందునేని మగమొల్క జనించె నటంచు విన్న, వా
నిందవు చిత్తమందునిచి నిండుగ యౌవన మబ్బఁగానె, మే
ముందవు కోరినట్టులనె భూరిగఁ గట్నము లిత్తుమంచు, మీ
విందు పసందు మాకనుచు, వేడఁగఁ జూతుము కన్నె వారలన్.

చ॥ కొడుకొకరుండు పుట్టఁగనె కోర్కులు తీఱె ననంగఁ బొల్చి, తా
మడిగిన కట్నమిత్తుమని యాడెడి వారల రోయుచుండి, యా
గడమున నద్ది యిద్ది యని ఘర్షణఁగన్నెల వారి చిత్తముల్
గడబడఁజేసి, కట్నములఁ గాంచఁగఁ జూతుము పుత్రువారలన్.

—: యుగ్మకము :—

ఉ॥ మాటకు వేలువేలు బ్రతిమాలి, ధనంబులనిచ్చి, కన్యలం
బాటవ మేదినం, బిటికి పంపయున్ననను, గోజి గోజి, పల్
పాటుల షాహుకారులనె బల్మివరింపఁగ వేఁడు కొంద్రు, బల్
మేటరి, దిట్ట పేదఁగని మెచ్చి వరింపఁగఁ జూడ రేలకో
సాటికి రాఁడటంచుఁ దమ చక్కని చూపున కందకుండుని
ప్పాటను మానవుల్మెలఁగఁ బాటిలకుండునె గోడు లక్కటా!
నీటుకు మాటకే విలువ నెగ్గెను, బేదలు వ్యర్థులైరి, యె
చ్చోటను జూచినందరను జోద్యము లివ్విధి నొప్పుచుండెడిన్.

తే॥ గుణము లొల్లరు వయసును గూర్మినొల్ల
రెటులొ చెఱ దీఱెనని మదినెంతురకట!
కన్నెలను గన్న తండ్రులకర్మమేమొ
కొడుకులను గన్న తండ్రుల గొప్పయేమొ. 106

చ॥ గొనములు, జవ్వనంబు, కడుఁ గూరిమి, విద్దెయు, నీడుజోడు, నె

కొ్కను యువకుల్ తమంతఁ దమిఁ గూర్చినఁ జెల్లునుగాని యి
మ్మెయిఁ-ధనముల నిచ్చి వేలము విధంబున బేరములాడి, కొన్న
నా-మనువులు ప్రేమపూతమయి మన్ననలందఁగఁ జాలునే ధరన్.

తే॥ విశ్వపతి లేఖలన్నియు విప్పి చూచి
మంచి యామని యని మదినెంచి వాని
నొక్కటొక్కటి జతఁగూర్చి యొక్కనాఁడు
కొడుకు భావంబుఁ దెలిసికొనడిగెనిట్లు. 108

చ॥ మెఱుఁగుగ నీకుఁ బెండ్లి తలపెట్టితి మోహాన! యేమియందువో
చిఱుత తనంబుగాద డిగి సేయుట యుక్తమయంచు నెంచి, నే
నెఱుఁగఁగఁ గోరి, నీమనము నిర్యోడఁ జేరితి నేమిసెప్ప నీ
తఱి మన భాగ్యమేమొ పలుతావుల లేఖలువచ్చెఁ జూడుమా.

—: మోహానుఁడు డబ్బుకాసపడి పెండ్లియాడుట తప్పని :—
నిరూపించుట.

చ॥ అని తన కేల నున్న మెఱుఁగారెడు లేఖలకట్ట విప్పి, యా
తని కడ బల్లపై నునిచి, తానొక వంకను కూరుచుండ నా
తనయుఁడొకొక్క దానిఁ దన తండ్రి వినంగఁ బఠించి వహ్వా! భేష్,
మనువులకైన బెండరులు మంచివె వచ్చెను మీరు మెచ్చఁగన్.

తే॥ జనక! మీమెచ్చు సంబంధ మనఁగ నేదొ
తెల్పుఁడని యన్నఁ దండ్రి తాఁదెలిపె నిట్లు
నీకుఁ దెలియని దేముండు నిక్కముగను
మేలు కడపటి లేఖయ చాలు ననిన. 111

ఉ॥ చూడఁగ లేదు శీలమును, సోయగ మంతయు మున్నె లేదు, నా

యీడునకు జోడు గాదనఁగ నీప్రతిమాకృతి చాటుచుండుఁ, బూ
బోఁడుల చిత్తవృత్తి తగ మున్ పరికించుట భావ్యమౌఁ గదా
పాడు ధనంబుఁ గోరి తగవా! సుతు నమ్ముకొనంగఁ దండ్రికిన్.

చ॥ కపటము లేనివర్తనము, కార్య ధురీణత, సాధుచింత, స
త్యపరత, నిత్యతృప్తి, హృది సాదర భావము నెల్లవారిపై,
నుపకృతి సేయుతల్పు, మనసొప్పఁగ భక్తి, ప్రియాను రక్తి, గ
ల్గు పడఁతులన్ మనంబలరఁ గూర్చి వివాహము సేయ నొప్పగున్.

మ॥ తలఁపం, దిండికిఁ దిప్పరాజుఁ, బని పందెం జూపు గుఱ్ఱంబు, నౌ
వెలఁదిన్ లోఁగిఁ, గురూపిఁ, గట్టుకొనినం బీడించుఁ గాదే, మహీ
స్థలి నెందేనియుఁ జూడఁ గంటిమె ప్రశస్తంబైన సంబంధ, మీ
కలి ధర్మంబుల మాయలం దెలియుటల్, కాంతార సంచారముల్.

చ॥ ఎఱుఁగుము తండ్రి! యీమనువు లెయ్యవి నామది కింపుగావు, నే
నెఱుఁగుదుఁ బెండ్లికై తగవు నెయ్యది నాకు సమంజసంబొ యీ
మఱుఁగుల బేరముల్ వలదు, మానుము నీవిఁకఁ బెండ్లిచింత, నీ
వెఱిఁగిన ధర్మ మొక్కటియె యెచ్చుగ విత్తము వచ్చిచేరుటే.

చ॥ అనవుడుఁ దండ్రియిట్టులను నంచిత నిర్మలబుద్ధిఁ దల్పు, మిం
చిన తఱువాత నెమ్మొయినిఁ జింతిల లాభముఁ గాంచలేము, నాఁ
దనయుఁడు తండ్రికిట్టులను "ధర్మము మీఱఁగఁ బాడిగాదు నా
మనువును జూచుకొంటి ననుమానము మానుము నమ్మునావుడున్

చ॥ అరయఁగ లేవు మోహన! యనార్య పథమ్ముచుద్రొక్కుచుంటి వే
వరుసను గాని ద్రవ్య సముపార్జన మానవ లక్షణంబు, త
త్పరు లయి, కన్నపాట్ల కిల పాల్పడి, యర్థము సేకరింపఁగన్,

సిరులు తమంతఁ దా వలవఁ జెల్లునె కాళ్ళులఁ జిమ్మ మూర్ఖుఁడా!

చ॥ అనుటయు మోహనుండనియె నయ్యా! యిదెవ్విధి నీకుఁజెల్లునీ
వనయము నర్థచింత మెయి నారయవేది హితంబగుందగన్,
మునుమున వృద్ధులైతి రిఁక మోహము వీడుట పాడిగాదె, నీ
ధన మననంబు, లోభమును, దప్పకమానుము, చెల్లునే యిఁకన్

క॥ మోహను పలుకులు వెంటనె
మోహన శరమట్లు గాఁడి ముగ్ధునిఁ జేయన్
మోహము వీడఁగ జనకుం
డాహవమున యోధుఁడట్టులలరఁగఁ జొచ్చెన్. 119

ఉ॥ వాసిగ నప్డు విశ్వపతి భ్రాంతి తొలంగఁగ, నెమ్మి "మోహనా!
భాసురమయ్యె నీ తెలివి, పాసెను మోహము నాకు నింక, వి
శ్వాసము గల్గె నీయెడ, నెసంగుమ" యంచు వచించి యేగఁగా,
"మోసముగాదొ"యన్పలుకు మూలగవాక్షమునుండి వచ్చినన్.

ఉ॥ నాయెడ మోసమేమి, యిటు నాయమెఱుంగక పల్కువారలి
ప్డీ యెడ నేరు లేర, యిదియేమి విచిత్రము తోఁచదయ్యె, నా
హా! యిదియేదొ కీరమిట హాయి గవాక్షము మీఁదనుండు, నే
నీయెడనుండి చూచెదను, నేమి వినంబడు నిందు మీఁదటన్.

వ॥ అని నిశ్చయించి కరగృహీత పత్రికా వ్యాపృత చిత్తుండై యుండు
నంత 122

—: సుశీల కడనుండి వచ్చిన చిలుక మోహనుని దూఱుట :—

ఉ॥ బాసలుచేసి, పొంకమగు పల్కులతో వలపించి, నెమ్మినా
వాసపు నమ్మిగల్ తుదకు వమ్ముగఁ జేయుటెకాక నమ్మియే,

దోసములేక యుల్లసిలు తొయ్యలి యుల్లము దొంగిలింపఁగా
మోసముగాదొ, యిమ్మెయిని బుద్ధిఁదలంపక యుంటమోహనా!

ఉ॥ అచ్చుగ నీదు పోక కడునంచితమై కను పట్టుచుండినన్
వచ్చిన నాటఁగోలె నొక పత్రికనైనను వ్రాసినావె? తా
నుచ్చులు తెంచుకొన్నపులి యూఁడని బాడు తెఱంగు దోఁప,
నీముచ్చటఁ దీర్చునింతి విడి, పోయిన పోకఁగఁ బోవధర్మమే.

ఉ॥ శ్రీయుత మూర్తి మాసకియ చెల్వలరంగఁగ నీవు, కాకతా
ళీయము గాఁగ వచ్చితి వళీకపుఁ బ్రేమను బేలుపుచ్చి, యే
మాయలెఱుంగ లేకలర, మాయల మచ్చులఁజల్లి, మోసముం
జేయఁగ నీకుఁజెల్లునె విశేష విధిజ్ఞుడవంచు నెంచఁగన్. 125

ఉ॥ నేమపు మోహమున్నిలిపి, నిర్మలచిత్త, విధిజ్ఞ గాన నా
భామిని చిత్తజాధముఁడు బాధలు పెట్టిన నోర్చుకొంచు, నే
మేమొ దలంచుచుం, గుడువనెంచదు, త్రాగదు, నిద్రవోవదీ,
కామిని కర్మమేమొ యని కాంచుజనుల్ కడు వింత నొందఁగన్.

ఉ॥ తల్పముఁ జేరి శీతకరు తాపముఁ దాళఁగ లేక వెంటనే
తల్పులుమూసి పండుకొనఁ దంత్రము లెర్గిన మాయలాఁడు సం
కల్పమదేమొ నీముఖముఁ గంటికి ముందఱ నిల్పఁజూచు వే
తల్పులు తీయఁగానె యెగతాళిగఁ గోయిల కూయసాగెడిన్.

ఉ॥ పొత్తముఁ బూని కాలమిఁకఁ బుత్తమన న్మనసందులేదు, వే
తత్తఱపాటు కీల్కొనఁగ ధైర్యము జాఱఁగ నిల్వలేక, యా
యుత్తమ పుష్పవాటికల నొయ్యనఁ బూవులు కోయనేగఁగాఁ
జిత్తజుఁ డాగ్రహించునని చిల్కలు పెల్లుగ గోలసేసెడిన్. 128

చ॥ పగలును రాత్రి మాసకియ పద్మదళాక్షి సుశీల యిట్లు నె
వ్వగఁగొని చిన్నపోవఁ దలఁప న్వదనాంబుజ మల్ల మన్మథా
శుగ జనితాగ్నితాప పరిశోషితమయ్యె ననంగఁ దోఁచెడిన్
బగతుఁడునేని దీనజన బాధలఁజూచి సహింప నోపునే. 129

ఉ॥ ఎన్నిదినంబులిప్పగిది నేడ్తెఱ నీవిర హాగ్నికోర్చు నా
చిన్నది, పువ్వుఁ బోఁడి, కనుఁజెల్వ, లతాంగి, సుశీలకన్య, నే
నున్నది యున్నయట్టు లిపుడొప్పఁగఁ బల్కితిఁ జిత్తగించు, కా
నున్నది కాక మానదని యుండినఁ గార్యము మించు మోహనా!

చ॥ అలసి కృశాంగి మాసఖియ నల్పములో వెతలొందుచుండ, నేఁ
దెలిసి వలంతి పాట్లుపడి తేర్పఁగఁ జూచితిఁగాని, యింక నా
యలవికి మీఱి యుండుటను నారసి నీకిది దెల్పఁగోరి, మేల్
తలఁపున వచ్చితి న్వినుము తల్పుము నెచ్చెలి ప్రాణరక్షకై.

తే॥ మగువ పెంచిన చిల్కనై పరఁగుచుంట
నింతగను వేఁడుకొందు, నశ్చింత నుంట
కిది యదను గాదు మోహన! యేది హితవొ
చూచి తెల్పుము వేగమె సుదతికిపుడ. 132

చ॥ అనుటయు మోహనుండు తనయంగము లంబులకల్ హుటాత్తు జ
ల్లునఁ బొడమంగఁ గీరమ! నిరూఢి వచించితి నిన్ను మెచ్చితిన్
మనమును నాది చేకొనుచు, మానిని మానస మిచ్చెనాకు, నే
యనువున నౌను సాహసమిది యక్కట! దూఱఁగ నీకు నాయమే.

చ॥ తఱచు ప్రియాంగనా హృదయ తాపము మాత్రమె కాని, ధూ
ర్తుఁడా-మరుఁడు దహించు దేహమును మంటలఁ బొక్కుచునుం

ద్రుఁజూడుమా-సరసిజ లోచనా పరవ శాత్ముఁడనై పరికింపలేక నే
మఱచితి నెల్లలోక మనుమానము లెందుకు విన్మ కీరమా. 134

చ॥ మఱచితినంచు మీసకేయు, మానిని, నన్నెద దూఱునంచు నే
నెఱుఁగుదుఁ గాని, యోచిలుక! యిమ్మఁ దలంచక సంభ్రమింప
నే-తెఱఁగునఁ గార్యముల్ జరుగు? తెల్పుము ప్రేయసి కింత మా
త్రమీ-వరుగుము తెల్పుదున్ శుభము నంచితపద్ధతి నింతలోపలన్

క॥ అని పలుకు నంత లోపల
జనకుఁడు చనుదెంచి యటకు జరిగినదెల్లన్
విని సంతసించి పలికెను
జనుమీఁక శుభమగును గాతఁ జయ్యాన ననినన్. 136

తే॥ చేరఁ గాశ్మీర మరిగెను గీరమపుడు
చీరి దైవజ్ఞులను మనసార విశ్వ
పతి ముహూర్తముఁ బెండ్లికి వెతకుఁడనిన
శుభముహూర్తముఁ బెట్టిరి శోభనముగ. 137

చ॥ చెలిమి నెసంగు శ్రీహరి సుశీలలకున్ శుభలేఖఁ బంప, నా
వెలఁదియు నన్నయున్మిగుల వేడ్కలనందిరి నెమ్మనంబులన్
గొలఁది దినంబులందమకుఁ గూర్మి వివాహ మటంచు, సంబరం
బలర సుశీల మోహనుల యాత్మలు పొంగెను నందు నిందుననన్.

సుగంధి వృత్తము:—లోకమందు ధర్మచింత లుప్తమౌటఁగాంచ వా,
యేక తంబో యీ యుపేక్ష కిట్టి చూచుచుందువా
సాకతంబు లేక నీవు సంతసంబుఁ గందువా,
నీకృపా కటాక్ష మెన్న నిర్మలంబు రాఘవా. 139

స్రగ్విణి:—భూమిజా సంగతిం బొల్చునిం దల్చినన్
కామితార్థంబులుం గల్గు నంచెంచితిన్
సామ గానంబులన్ శాంతి సంధిల్లఁగన్
రామ భద్రా! నినున్ రక్షకై వేఁడెదన్. 140

గద్యము:—ఇది శ్రీ భారద్వాజ గోత్ర పవిత్ర ఆపస్తంబ సూత్ర రాఘవాచార్య ద్వితీయతనూజ శ్రీరామచంద్ర కరుణా కటాక్షలబ్ధ కవితా విస్ఫురణ కాండూరు నరసింహాచార్య ప్రణీతంబైన మోహన విజయంబునందు ద్వితీయాశ్వాసము.

సంపూర్ణము.



—•‚• శ్రీ రామ చంద్ర పరబ్రహ్మణేనమః •‚•—

శ్రీ

# ★ మోహాన విజయము. ★

## (సాంఘిక ప్రబంధము.)

### తృతీయాశ్వాసము.

క॥ శ్రీ జానకీ మనోహర
తేజో విలసత్ప్రతాప దీప్యన్మూర్తిన్
భ్రాజద్ధర్మ ధురీణున్
రాజీ వాక్షున్ ప్రసన్న రాముం దలఁతున్. 1

—: వసంత వర్ణనము. :—

శా॥ శ్రీరంజిల్ల వసంత వేళ యరుదెం
చెన్మోద ముప్పొంగ, సం
సారు ల్కార్య భరంబడంగె ననుచున్

సంతోసముంజెంద, నే
పారస్నాత్న విలాసి దంపతులహా
హాయంచు రంజిల్ల, స
త్త్వారంభంపు విధానముల్ ప్రభువరుల్
ప్రోక్షిం దగన్ దీక్షఁగన్, 2

చ॥ సలలిత పంకజాకర లసత్సర సీరుహ సంగతంబులై
మలయజవాయుపోతములమంద సుఖాస్పద సత్ప్రసారముల్
పొలయఁగ వీవ, జవ్వనపు ముగ్ధలు నిచ్చలు సంజమాపులన్
లలిత విలాసధామముల రంజిలుచుండ్రు వనాంత సీమలన్. 3

ఉ॥ వచ్చె వసంతుఁడన్వాలపు వార్త వినంగ వనీ ప్రియాంగనల్
హెచ్చుగ సంతసంబెద వహించి, చిగుర్చుచుఁ, బూల ముడ్చుచున్
ముచ్చటఁగూర్చు జేగురగు మోదుగు పువ్వుల చీరఁగట్టుచున్
మెచ్చుగఁ గోకిలా సఖులు ప్రేమపు గీతులు పాడఁ బొంగెడిన్. 4

చ॥ అలరెడు మాధవుండడటు నంగజు నెచ్చెలిఁ గూడి రాఁగ, నిం
పులు దళుకొత్తఁ, గామినులు మోదము నంగయిసేసి, రంగవ
ల్లులు తమ ముంగిటన్ సుమములన్ వెదజల్లి చెలంగు చుం
డునట్లల వనదేవతల్ సుమములంగణ మంతట రాల్చిపోల్చెడిన్.

తే॥ రాగముదయించెఁ జిగురుల రమణులందు
విరిసె యువకుల మనములు విరులగములు
చెలఁగె వనములు మనములు చెలుము లెసఁగె
ధరణి వెలుఁగొందు నవ్వసంతంపువేళ. 6

క॥ సంతసముఁ గొల్ప మాధవుఁ

డంత వసుంధరయు నలరె నతిమోదమునన్
సంతతమడరెడు వేడుక
వింతగ వైవాహికంపు విధులు తనరఁగన్. 7

## మోహానుని వివాహ ప్రయత్నములు.

ఉ॥ ఎన్నఁడు లేని చాగ మెలయించఁగఁ దండ్రి మనః ప్రియంబుగన్
గ్రన్నన మోహనుండతుల కల్పన చాతురి మించి యొప్పఁగన్
బ్రన్నన మందిరంబఖిల మంగళ ధామముగాఁగఁ జేయుచున్
బన్నియలంకరించె బహు భంగుల సారులు తీర్చి దిద్దుచున్. 8

ఉ॥ ద్వారములందుఁ దోరణ విధాన చమత్కృతి యందగింప, రం
భారమణీయమై మిన్నుల భాసిలఁ బందిరి కొబ్బరాకులున్
సారు నొసంగ, నైదువలెసంగ వివాహపు సంబరంబులన్,
గోరికె తీఱె నంచపుడు కోమలి మోహాను తల్లి రంజిలెన్. 9

శా॥ విద్యుద్దీపపు రాజి సారు లొసఁగన్
విద్యున్మాల భంగిన్, సమ
స్తోద్యత్సౌధ వితానమున్మెఱయఁగా
నుద్యోతి తంబొచు, నా
నద్య న్మంగళ తూర్యనాదము మహా
నందంబుఁ జేకూర్పఁగా
నుద్యత్స్ఫార విలాస మందిరము నా
నుత్తేజితంబై తగన్. 10

తే॥ బంధు మిత్రులఁగూడి వైభవము వెఱయ
శ్రీహరి సుశీల లరుదెంచఁ జెలిమి యలర

నెదురు కోల్సల్పి వారల నెలమితోడ
విడిది సేయించె నొకయింట విశ్వపతియు. 11

తే॥ మంగళ స్నాన మహితులై వధువు వరుఁడు
నిష్టదేవతా ప్రాంజలిఁ దుష్టి సలిపి
కంకణాలంకృతంబులై కరములలరఁ
బెండ్లిచవికెను జేరిరి పేర్మితోడ. 12

ఉ॥ బంధులు మిత్రబృందములు పందిరి నిండఁగఁ గూరుచుండి, సం
బంధము మంచిదంచొకరు, బాల సుశీల యటంచుఁ గొందఱున్
బంధుర భావముల్ దనరు వారల యిర్వురునంచుఁ, బల్కఁగా
గంధ గజేంద్రయానఁ గని కాంచన చేల సుశీల నచ్చటన్. 13

ఉ॥ అంతఁ బురోహితుండొసఁగి యందఱ హస్తములందు నక్షతల్
"సంతత మంగళం బగుత, శాంతియుఁ, బుష్టియుఁ, గల్గుఁగాక య
త్యంతము నాయువుంగలుగు" నంచు వచించుచుఁ బెండ్లివారిపై
సంతస మొప్పఁ జల్లఁగనె చల్లిర యందఱు నట్ల పల్కుచున్. 14

చ॥ సతతము నర్థకామ సుఖసంగతి దుఃఖ శుభోదయంబులన్
వితత విశిష్ట ధర్మముల వేఱయి యుండక నొండొరుల్ ప్రజా
తతిఁ గొలువంగ మేమిపుడు ధర్మగతిం దగఁ బెండ్లియాడినా
మతి చరియింప మేయెడను నంచిరువుర్ సలుపం బ్రమాణముల్.

తే॥ హైందవాచార పద్ధతి నార్యజనులు
మెచ్చునట్లుగ మోహనుండెచ్చు వేడ్కఁ
గట్టె మంగళ సూత్రంబు గళమునందు
బాళి గ్రహియించెఁ జెల్మిఁ దావర సుశీల. 16

క॥ బంధుగులు మిత్రులుం దగ
నందఱు నాశీర్వదించి యక్షత లెలమిన్
బొందుగ దంపతులలరుచు
నందంబుగ దలలువంచ నంటుంచి రొగిన్. 17

క॥ విందుల సల్పఁగ నందఱు
కుందగు విధమొప్పఁ దృప్తిఁ గొల్పఁగ నంతన్
జందన తాంబూలంబులఁ
గ్రందుగ నొసఁగంగఁ జనిరి గరిమ నలరుచున్. 18

వ॥ ఇవ్విధంబున మోహనుండు సుశీలం బెండ్లియాడి, నూత్న వివాహ విలాస భాసుర దినంబులెల్లం గడిపి, కొండొక కాలంబునకు దేశ సేవా పరాయణ తన్మలంగం దలంచి, తనకుఁ గల యైశ్వర్యంబునఁ గొంత త్యాగంబు సేయ నిశ్చయించి. 19

సీ॥ ఒక యూరఁ గొమకొప్ప నొక తటాకము నిల్పె,
నొక యూరఁ ద్రవ్వించె నొక్కబావి,
నొకచోటఁ గట్టించె నున్నత విద్యాల
యంబు, నొక్కటఁ బఠనాలయంబుఁ,
జక్కని సహకార సంస్థల నెలకొల్పె,
నుచిత వైద్యాలయంబుంచె నొకట,
దిక్కుమాలిన వారి చిక్కుఁ బాప ననాథ
శరణాలయము నిల్పె జనులు పొగడ.

తే॥ అహరహంబును దనపేర నచట ధర్మ
సంస్థ లందెల్ల పేదలు సంతసమునఁ

బొదలు నట్టుల మోహాన బుధుఁడు చూచు
కొనుచు నుండెను గొఱఁతలు తనరకుండ. 20

—: మోహానుని దేశ సేవ. :—

చ॥ నియమముతోడ మోహానుఁడు నిచ్చలు పల్లెలకేగి పౌరులన్
నయముగఁజేర్చి యొక్కయెడ నచ్చిక నీతియుఁ, బౌరధర్మముల్,
భయములు లేని గ్రామ పరిపాలనపద్ధతి, బోధసేయుఁ, ద
న్నియ మిత సంఘముల్ నియతనీతి పథంబునఁ బొల్పునట్లుగన్.

చ॥ వెలఁది సుశీలయున్ మగని వెంటనె యేగు సునీతి బోధముల్
సలుపఁగ, ధర్మ తత్పరత, జాణతనంబును, మంచి చెడ్డలం
దెలియఁగఁ జాలు విజ్ఞత నుతింపఁగ నొప్పెడు సత్ప్రవృత్తి, మేల్
తలఁపున భర్తృసేవనమె, ధర్మము చానలకంచుఁ దెల్పుచున్.

చ॥ ఒకరికిఁ గీడుసేఁత, మఱియొక్కరి మేలుకు నోర్వకుంట, యిం
కొకరికిఁ గార్యహానికయి యుబ్బుట, రక్కసులట్లు గొంతులన్
మెకముల భంగిఁ గోయుటయు, మేలగు నీతియె మానవాళికిన్
సుకముల వెట్లు గల్గు నొరుఁ జూచి సహింపని వారికిద్ధరన్.

ఉ॥ పొందిక నన్నదమ్ములటు పొంది పొసంగిన మేలటంచు, నిం
పొంద సునీతి తత్పరత నుండి హితంబును దోడివారికిన్
గ్రందుగ సల్పుచున్ మిగుల రంజిలు పల్లెల వారి సంపదల్
దందడి హెచ్చఁగం ధర నుదార సుఖంబులఁ దేలకుందురే. 24

ఉ॥ అందఱు గూడి యొక్కయెడ హాయిగ ధర్మపుఁ జింత సేయుచున్
ముందు యుగానఁ బల్లెలను ముచ్చటఁ దీఱఁగ నొప్పుచుండ్రు,
నేఁడెందుకొ ధర్మచింతవిడి, యీర్ష్యలఁ బెంచుచుఁ బ్రొద్దుపుత్తు

రే-మందము, కాలదోషమిది, యారయనెట్టులు తీఱునోకటా!

ఉ॥ మువ్వపు వేఁడు కల్దనర మాటల నవ్వుల నుత్సహించుచుం
రివ్వన రాట్నముల్వడుక రింగను మ్రోఁతలు తోడుపాటగా
నవ్వలు జవ్వనుల్గలిసి యందఱు హాయిగఁ బాట పాడఁగా
నవ్వఱు వొప్పు రాట్నముల యచ్చపు రోజులు వచ్చునో మఱిన్

చ॥ వరుసఁగ రాత్రివేళ బుధవర్యులు గ్రామపు దేవళంబునన్
బరఁగఁ బురాణముల్ సదివి ప్రౌఢిగ నర్థముసెప్పుచుండఁ, ద
త్పర మతులై చవి న్వినుచు ధర్మ విశేష వినిశ్చితాత్ములై
వరలఁగఁ బొల్చు భాగ్యములు పల్లెలవారికిఁ కెన్నఁడబ్బునో.

ఉ॥ భూమి సమత్వము ల్దొలఁగ, బూడిద పెంటలు రోఁతసేయ, మా
కేమిటికన్న ధోరణిని నెల్లరు సూచుచు నూరకుండ, సాం
క్రామిక రోగ సంతతులు రమ్మని పిల్చిన యట్లురాఁగ, నోఁ
గాములు దెల్పువారలేఁక గ్రామము లందెవరుందు రక్కటా!

చ॥ చదువులు సంధ్యల న్మఱచి సంతత మాలను మేపుకొంచు, కాల్
కదుపక గ్రుడ్డివారివలెఁ గాలము పుచ్చుచు నుండువారికిన్
విదితము గాదు లోకము, భువిన్ సతమజ్ఞులు గాన నేవగిం
బొందలు వివేక సౌఖ్యములు, పొందికలెవ్విధిఁ జేకుఱుందగన్.

ఉ॥ పౌరత యన్ననేమి, పరిపాలన పద్ధతులన్ననేమి, యం
చారసి రాజకీయముల, నంచిత విజ్ఞుఁడనంగఁ బొల్చి, యె
వ్వారలు నీతి కోవిదులు, ప్రాజ్ఞులు, దేశహితైక దృక్కుల
వ్వారినె యెన్నుకొంచుఁ దగఁ బాలన సేఁతకుఁ దోడ్పడన్వలెన్.

ఉ॥ అన్నలు తమ్ములంచుఁ, దమ యన్వయమంవొక గుంపు వారిపై

మన్ననఁ జూపి యెన్నికొన మాన్యపుఁ బౌరత పాడుసేయుటే,
యెన్నికలం బ్రభుత్వమున కెన్నిక సేఁత వివేక శూన్యులై
గన్నలనిచ్చి నీచులకుఁ గాళ్లకు మ్రొక్కుచుఁ దిర్గుటేయగున్.

ఉ॥ ప్రజలె ప్రభుత్వమంచ డరు బాధ్యత పౌరుల ధర్మమంచుఁ, దా
నిజముగఁ బౌరధర్మముల నిశ్చల చిత్తత నాచరించు వాఁ
డు జగమునన్ సునీతి పరుఁడుజ్జ్వల నిత్యసుఖంబు లొప్పఁగన్
విజయములందు చుండుఁ బృథివిన్ సమభావము లుల్లసిల్లఁగన్.

ఆ॥ వె॥ అన్నదమ్ములట్టు లైకమత్యముఁ బూని
కులము మతము లెంచకుండ నెపుడు
ప్రజల పాలనంబు ప్రౌఢి సాగుచునుండు
నపుడె శాంతి ప్రజకు నతిశయిల్లు. ౩౩

క॥ చతురుఁడు బుద్ధి చమత్కృతి
సతతము పనియందుఁ జాక చక్యములడరన్
దత కార్య ధూర్వహుండగు
మత కులములఁ జూచి ప్రజ్ఞ మానుట తగవే. ౩౪

తే॥ పరఁగఁ బంచాయతుల రాజ్యప్రాభవమున
గ్రామ మొక్కొక్క రాష్ట్రంబుగాఁగఁ దెలిసి
కలఁతలను మాని యన్యోన్య కలహముడిగి
పాలనము సేయఁ బల్లెలు ప్రౌఢివెలయు. ౩౫

క॥ పల్లెకు నొక్కటి వంతున
నుల్లసిలం బాఠశాల యొజ్జలు ఘనులున్
బెల్లుగఁ దెలిసిన వెజ్జును

జల్లని వాపియును నుండ సంతసమొదవున్. 36

తే॥ ఒక్క సహకార సంస్థయు నొప్పుచుండఁ
జౌరులున్నీతి నియమముల్ పాటిసేయ
మొక్కపోకుండఁ బైరు పెంపెక్క యవరఁ
బొగడఁ దఱవకాని పల్లెల పుణ్యమిలను. 37

మ॥ అని యారీతిగఁ బల్లె పల్లెకు ననా
యాసంబుగా నేగిమో
హనుఁడావ్వేళను నిత్యకృత్యముగ ఖా
ర్యంగూడి బోధంబు సే
యను, జౌరుల్ మనసారఁ గైకొనుచు నా
హాయంచు నాశ్చర్యముల్
తనరం బల్కిరి గాదెయీతఁడ యిలం
ధన్యాత్ముఁడౌ న్వాక్కులన్. 38

ఉ॥ జీతములిచ్చి పెల్లుగను, సేవకు నిల్చిన దొంగడై రులన్
బ్రాఁతిగ బ్రాసికొంచుఁ, బయివారికి మెప్పుగ నాట్యమాడుచున్
గోఁతలు కోయుచుం గుజన కూటములుల్లసిలంగ, నిత్యమీ
రీతిగ మోహనుండ తులరీతుల సేసలుసేయుటేలకో,
నీతికి బద్ధులై పరఁగు నిర్మల చిత్తులకున్నె హేతువుల్. 39

చ॥ సకల జనంబులుం బొగడు చందమునందగ మోహనుండు, దా
నకపట వృత్తిమై వరలు నప్పుడు ధర్మపురంబునందుఁ, బూ
నికమెయిఁ జౌరులందఱకు నిశ్చితకాలము వెల్లడింపఁగాఁ
బ్రకటి తమమ్యేనంతఁ బురపాలక సంఘుపు టెన్నికల్లగన్. 40

78 .: నెచ్చెలులు మోహనుని బలాత్కరించి యెన్నికకు నిలుపుట :.



ఉ॥ వచ్చెఁ బురంపు టెన్నికలు, వారక మీ రొక వాడకుందగన్
మచ్చిక నిల్వఁగోరుదుము, మాకిది నచ్చిన మార్గమంచు, మా
ఛ॥ మెచ్చును దెల్పుకొంటిమిఁక, మీమనసెట్టులొ, యంచు మోహ
నున్-నెచ్చెలు లొక్కనాఁడతని నిర్ణయముం దెలియంగఁగోరినన్.

వ॥ మిత్రసత్తములారా! మీహృదయంబు సరసంబు, మీమనోరథం
బు శ్లాఘనీయంబ, కాని యొక్క విశేషంబు వినుండు రాజ
కీయంబులు క్రూర సత్వాశరణ్యంబులగు నిబిడారణ్యంబులు, అం
దును నెన్నికలన్న నిక్కాలంబున నైంద్రజాలిక విలసనంబులు,
యోగ్యతా బుద్ధులకుఁ గనకట్టు మంత్రంబులు నందిని బందినిఁ
జేయను బందిని నందినిఁ జేయను సమకట్టువారికి విహార భూము
లు, దుర్ఘటా శాపూరణంబుల కలుచేతి నైకుంఠంబులు, పక్ష
పాత పిశాచంబులకుఁ బట్టుఁగొమ్మలు, పరిపాలనా సమర్థ స్వతంత్ర
వ్యక్తులకు దిన గండంబులు, విశాల భావ వికసనంబులకు వెలుఁ
గు చొరని చీఁకటి గదులు, దౌష్ట్యంబులకు విలాసమందిరంబులు,
బలా బలంబులు నిర్ణయించు సంగ్రామ రంగంబులు, సాధువులకు
దుర్గమంపుఁ ద్రోవలు, నానావిధ భేద బుద్ధ్యుత్పాదక నేత్రాంజ
నంబులు, కపట భూయిష్ఠంబులు, దురాశా ప్రేరితంబులైన
యట్టి యెన్నికలం బ్రవేశించి యగుడు వట్టుట కన్న దేశ సేవా
తత్పరుండగు స్వతంత్రుండు నిర్నిబంధంబుగ దేశసేవ సలుపుట
సర్వోత్కృష్టంబగుటయకాక నిర్మలంబును, మనఃప్రియంబును,
మోక్షదాయకంబు, నగునని యెఱుంగుదుననిన వారలిట్లనిరి. 42

ఉ॥ మిత్రమ! యేమిపల్కు? పుడమిన్ మిముఁ బోలు నుదారులెల్ల స
త్పాత్రులుపేక్ష సేయనిఁక ధర్మ ప్రవృత్తికిఁ దావులున్నె? యే
మాత్రము సంశయింపకుము, మానవయత్నము సల్ప,మీఁదటన్
మైత్రి జగత్ప్రసిద్ధమయి మించిన ధర్మము గెల్వకుండునే. 43

చ॥ అనుటయు మోహనుండనియె నంచిత ధర్మము గెల్చునంచు మీ
మనములఁ గల్గు భావములు మంచివెగాని, వచింతుఁ జక్కఁగన్
వినుఁడిల మానవుల్ పరఁగ విజ్ఞులు గాఁగను జెల్లునవ్వి, యే
మనఁదగు, నెద్దులీనెనని యంచునె గాటనుగట్టు మన్తతిన్. 44

చ॥ వినుఁడు మదీయ నిశ్చయము విశ్వము పోకడవేఱు, నాదు నె
మ్మనమిది యెట్టులోర్చు, నభిమానముఁ జంపుకొనంగఁ బాడియే
నను నలయించి బూటకపు నాటకమాడఁగఁ బూనకుండ్రుగా
కని మిము వేఁడుకొందునన నంతటఁ బల్కిరి మిత్రులివ్విధిన్.

చ॥ వెలుపల నుండుకంటె నొకపెద్ద సమాజము నందునుండి, పెం
పలరఁగ దేశసేవ సలుపందగు, ధర్మము వృద్ధిఁజెందుఁ, జే
దలకు హితంబుఁ గూర్పఁదగు తంత్రములెన్నియొ సల్పవచ్చు నె
చ్చెలులము మేము మీపనులు సేయఁగ నుండఁగఁ జింతయేటికిన్.

ఉ॥ అక్కట! మిత్రులార! యిటులాడఁగఁ జెల్లునె, సంఘమందు నేఁ
డెక్కడి ధర్మచింత, హితమెక్కడ సేయుట, వెఱ్ఱిమాట, యొ
క్కొక్కఁడు నొక్కప్రక్కకు మఱొక్కఁడు నింకొకప్రక్క లా
గుచున్-జిక్కులు పెట్టఁదప్పుకొను చింతకె కాలముచాలకుండెడిన్

ఆ॥ వె॥ అనుచు నెట్టకేల కతఁడొప్పుకొనఁగానె
మిత్రులెల్ల రతని మెచ్చుకొనిరి

పట్టణంబునందుఁ బ్రౌఢిగ నెన్నికల్
జరుగు కాలమదియు సంక్రమించె. 48

క॥ అప్పుడు పట్టణ మందున
తప్పక ప్రతివాడయందుఁ దనవేడు సంస్థల్
మెప్పుగఁ బోటీకి నిలిపెను
నొప్పుగ నొక సంస్థ నొకటియోడింపంగన్. 49

తే॥ మోహనుని వాడయందున మూర్ఖుఁడొకఁడు
సంఘబలమున గెలువంగ సంభ్రమించి
సాధు వితఁడెట్లు గెలుచు నన్సాహసమునఁ
బోటి సేయంగ నిలిచెను ముగ్ధుఁడగుచు. 50

తే॥ ఒక్క దినమున మోహనుం డొక్కరుండు
పత్రికం గొని చదువుచుఁ బరఁగుచుండ
గడఁగి వేగమె యొక పత్రికకు విలేక
రి, చనుదెంచుచు నిట్లని యచట నడిగె. 51

చ॥ చతురుఁడ! రాజకీయ పటుసంస్థ లనేకములుండు నందు నీ
మతికి హితంబదెయ్యదియొ మాకు హితంబుగఁ దెల్పుమన్ననా
సతత వివేక పూజ్యుఁడిటు చయ్యనఁ బల్కెను వానిలోఁ బ్రజా
హితకర సంస్థయే మచది హీనములన్నియు స్వార్థ పూర్ణముల్.

చ॥ ప్రజలకు మేలు సేయుటయ మాకు హితంబగు వృత్తి మా
కు జగమునన్వి భేదములకు న్మనమందునఁ జోటులేదు. స
ర్వ జనులు సౌఖ్య మందుటయ ప్రాకట సేవకు సత్ఫలంబునో
నిజముగఁ దెల్పితిన్మతము నిర్మల మిట్టిద సంఘమందునన్. 53

తే॥ అనుచుఁ దెలుపంగఁ బ్రకటించె నతఁడు దాని
నరసి మోహను బుద్ధికి మురిసి ప్రజలు
నెన్నిరందఱు నతనినే యెన్నుకొనఁగ
విజ్ఞు లెవ్వీధిఁ దలఁతురు వేఱు తెఱఁగు. 54

తే॥ పోటి చేసిన పురుషుండు కోటిజతన
ములను నెన్నియో తెఱఁగులఁ బూనిసలిపెఁ
గాని ఫలమది శూన్యంబు కడకు మిగిలె
మోసపోదురె విజ్ఞులు మూఢులట్లు. 55

ఉ॥ అంతట మోహనుండు మన మందున సంతసిలంగ, నెచ్చెలుల్
చెంతలఁజేరి యిట్లని వచించిరి మోహన! చూచినావె, నీ
చింత తొలంగె, సత్ఫలము చేకుఱె యత్నము సేయునంతఁ, దా
నంతట నిండియుండు పరమాత్ముఁడె సాయము ధర్మరక్షకుల్.

చ॥ గెలిచితి మంచుఁగాదు, మదికింకఁ గొఱంతలు తీఱలేదు, మే
మలరఁగ మీకు మేల్పదవి యబ్బెనఁ గాకవి తీఱవంచు, వా
రలు ముద మొప్పఁగాఁ బలికి, రాముఁడె తీర్పరియంచు నమ్మయి
మ్ములకయి యేగి రొక్కదినముల్ నియమించిరి చేర్మనెన్నికల్.

—: మోహనుఁడు చేర్మనయి పురమును బాలించుట. :—

సీ॥ డబ్బిత్తుమని కొందఱుబ్బించి సభ్యులఁ
గని యోట్లు కోఱుకునై మనవిసేయ
మనవారలుండఁగ బరుల నెన్నికొనంగఁ
బరువుండునే యంచుఁ బలుకరింప,
బలవంతముగఁ దెచ్చి పట్టి యుంచినవారి

నడుగడ్డునకు నేమి యంచునడుగ,
నాదు యోగ్యత యిది నన్నెన్నుకొని మీరు
ధన్యుని జేయుడు ధర్మగతిని.

తే॥ ననుచు మోహనుడాడగ, నందఱపుడు
ధర్మ తత్పరులగుటచే దలచి హితము
నోట్లు వేసిరి చేర్మను నొప్పుకొనగ
మోహనుండయ్యె చేర్మను ముదమెలర్ప. 58

తే॥ ప్రకటితంబైన వెంటనె ప్రాజ్ఞులెల్ల
జయజయ ధ్వానములు సేయ "నయముగెల్చె"
ననుచు మోహను గద్దెపై నధివసింప
జేయ నాతడు ప్రతినలు సేసెనిట్లు. 59

తే॥ ప్రజకు హిత మొనరించుటే పనియుగాగ
మెలగు చుండంగ బరమాత్మ మెచ్చుగాక
ప్రజలు నా చేయు పనులకు బ్రాకటముగ
సాయపడుచుండ వేడెద సంతసమున. 60

క॥ సతతము మీకు గృతజ్ఞుడ
నతుల శుభోదయమునంది యలరుడు మీరల్
మతికొలది సేవ జేయుదు
నుతియింపగ నాకు మీరునుణ్ సాయపడణ్. 61

తే॥ అనుచు నెల్లర వీడ్కొని యరిగె నతడు
మంచి ప్రభువయ్యెనని పొరులెంచిరపుడు
ప్రతిదినంబును మోహన ప్రవరుడుకడు

జెలఁగి పురపాలనంబుఁ దాఁజేయఁదొడఁగె. 26

చ॥ పురమున శ్రద్ధఁగైకొనుచుఁ, బూజ్యుఁడు నావిలసిల్లె మోహనుం
డరయఁగ నొక్క లోపమెటనైనను గాంచిన, దాని వెంటనే
సరిపఱునట్లు సేయఁ, దగుశ్రద్ధ తనంత వహించు నిచ్చలున్
బరఁగఁ బురంపువైభవము ప్రౌఢి వెలుంగఁగఁ జేయుబుద్ధితోన్.

ఉ॥ కొండెపు మాటలన్వినఁడు, కొంటెతనంబులు చెల్లనీఁడు, తా
దండి మనస్సువాఁడగుట ధర్మము త్రోవనె పోవుచుండెడిన్
దండుగ లొపనుల్సలుపఁ దావునొసంగఁడు చిత్తమందు, నీ
తండె గదా నుతింపఁ దగు ధార్మికుఁడంచుఁ బ్రజల్దలంపఁగన్.

ఉ॥ పన్నులు వేసి యెక్కువఁగ, భారము తోఁచఁగ నీఁడు బుద్ధికిన్
మన్నన లేదు కర్జములు మంటనుగల్పెడు దుర్జనాళిపై
నెన్నికలందు నోట్లు తనకిత్తురొ లేవొ యటంచు నెంచఁ, డే
మన్నను నిశ్చితాత్ములగు నార్యులు ధర్మముఁదప్పఁ జూతురే.

ఉ॥ వీధికి వీధికి న్వివిధ విద్యల నేర్పెడు పాఠశాలలన్
బాధలు లేని జీవికలఁ బండిత లోకములుల్లసిల్లుచున్
బోధలు సేయ, బాలకులు పొంగుచు నుందురు, పౌరవర్గముల్
సాధు వితండు విద్దెల నొసంగఁగఁజేసె నటంచు నెన్నఁగన్. 66

సీ॥ జాతీయ విజ్ఞాన సంస్కృతుల్చెడకుండ
దేశాభిమానంబు దిట్టపడఁగ
వృత్తి విద్యలు చాలవృద్ధిఁగాంచు విధంబు
సాంఘిక చతురతా సరణిఁ దెలిపి,
శాస్త్రీయ విజ్ఞాన శాక చక్రము మీఱ

గణిత శాస్త్ర విశేష ఘనతఁ గఱపి,
ప్రాంతీయ జాతీయ భాషాప్రబోధంబుఁ
ప్రౌఢి నంతర్జాతి భాష నేర్పి.

తే॥ సానఁ బట్టిన వరఖడ్గ చయమువోలె
గరిమ నొప్పెడు విద్యార్థి గణము మివుల
జుఱుకుఁ దనమున వెల్గొందు శూరులనఁగఁ
దీర్తురవ్వీటి యొజ్జలు దిటవుగాను. 67

తే॥ పౌరశిక్షణ శిక్షిత ప్రతిభ వెలయ
బాల బాలిక లొక్కటఁ బ్రాభవమునఁ
గూడి జాతీయ గీతికల్పాడు నపుడు
మనసు రంజిల్లుఁ దాదాత్మ్య మహితమగుచు. 68

ఉ॥ పౌరులు సేవకుల్ దఱియ వచ్చిన నాదర పూర్వకంబుగా
గౌరవ మొప్పఁ బిల్చి తమకంబునఁ జూపుచు నాసనంబులన్
మీరరుదెంచనేమి? వినిపింపుఁడు నాఁగ వచింప వారలున్
గోరిక సావధానమతిఁ గోర్కులు తీర్పఁగ వించు బంపెడున్.

ఉ॥ యోగ్యుల నిర్మలాత్ముల నియుక్తులఁ జేయఁగ శ్రద్ధ బూని, యా
రోగ్య విధానముల్ తవిలి రోయుచు వారలు రక్షసేయఁగన్
భాగ్య విశేషముల్దనరఁ బౌరులు సంతస మందుచుందు, రా
రోగ్యమె భాగ్యమన్నలుకు రూఢిగ జెల్లుచునుండె నప్పురిన్.

తే॥ వేళ వేళకుఁ బనివారు విధులు నెఱప
వీధులన్నియు దర్పణ వితతులట్లు
నిర్మలంబయి కనుపట్టు నిత్యమచట

సందు గొందులు గూడ గన్పిందు సేయు. 71

క॥ గంగా వాహిని తటమున
సింగారపుఁ బట్టణంబు చెలఁగ, జలంబు
పొంగెడు జలవాహికలు పొ
సంగఁగ నింటింట నడరు పంతస మొసఁగున్. 72

తే॥ పురము నల్గడ నుద్యానములు చెలంగఁ
బౌరు లెల్లపు డుల్లాస పాత్రులగుచు
మెలఁగుచుందురు విశ్రాంతి వేళలందుఁ
దవిలి మోహాను ఘనతకుఁ దద్దనలరి. 73

తే॥ రాత్రివేళలు పగలులై రంజిలంగ
వైద్యుతపు దీప పంక్తుల వ్వారిగాఁగఁ
జాలు చుక్కల వడువునఁ జాలనొప్పి
పురమునంతట నిరతంబు పొదలుచుండు. 74

తే॥ మురుగు జలముల నీఁగలు ముసురుకొనుచు
రోగబీజంబులందు నారూఢముగను
వరలనీయక మురుగు కాల్వలను సతము
శుభ్రపఱుపంగ శ్రద్ధతోఁ జూచుకొంద్రు. 75

తే॥ పురము నంతటఁ బఠనమందిరములుంచి
జనులు చదువరులై యొప్పి తనరుచుండఁ
గపట మెఱుఁగని మోహాన ఘనుఁడు నిచ్చ
లిట్లు పురపాలనంబు సాగించుచుండె. 76

ఇవ్విధంబున మోహానుండు కడు సమర్థుండై, యెల్లర హృద

యంబు లాకర్షించు తెఱంగున నెట్టియకార్యంబులకుఁ జోటీ
యక పుర పరిపాలనంబు నిర్వర్తించుటయకాక, తన నిత్య విధి
యైన దేశ సేవాపరాయణతనే మఱక శ్రద్ధాసక్తుల సల్పుచుండె
నంత. 77

—: మోహనుఁడు రాష్ట్రపు టెన్నికలకై ప్రచారము సేయుట. :—

చ॥ సకల జనంబులిమ్మెయి నచంచల సౌఖ్యసమృద్ధినంది, మా
నక ప్రభుఁడిట్టిఁ డౌనని మనంబుల నెంచుచు సంతసింప, న
మ్మకముగ మోహనుండతుల మానవసేవలు సల్పుచుండఁగాఁ
బ్రకటితమయ్యెఁ బత్రికల రాష్ట్రపు టెన్నికలంచుఁ జెచ్చెరన్.

ఉ॥ చయ్యన రాజకీయమగు సంస్థలవారలు సంభ్రమించి, తా
మయ్యెయి గ్రామముల్ దిరిగి యద్భుత పద్ధతిఁ బక్షవృద్ధికై
యుయ్యల లూగుచందమున నూరికి నూరికిఁ దిర్గసాగిరి
ట్లొయ్యఁ బ్రచారముల్ జరుగుచుండె విరామములేక పల్లెలన్.

ఉ॥ ఆసలు చూపి కొందఱును, నొప్పులు మాకని కొందఱు, న్మహా
త్రాసముఁ గొల్పికొందఱు, ముదంబునఁ గొందఱుఁ జేరఁదీయుచున్
వేసము లెన్నియో కడఁగి వేయుచు మోసపు బాసలాడ, నా
యాసములేల మానవుల, కార్యపథంబులు లేవె యోట్లకై. 80

తే॥ మోహనుని నెచ్చెలుల్వాఁడి మున్నువోలె
నధిక నిర్బంధ మొనరింప నతఁడు నియ్య
కొనుచుఁ బల్లెల కరిగి, తాఁ గూర్చిజనులఁ
దన్ను నెఱిఁగించి యోట్లకై విన్నవించె. 81

చ॥ అపుడొక యూరఁబౌరవరు లందఱుఁ గ్రందుగఁబల్కిరిట్లు, "మో

సపు వచనంబులం బ్రజల సంతతముగ్ధులఁ జేయనౌనె? బో
సపుఁ బనులేల, చెప్పెడు పనంబని సేయఁగఁ జేతఁగాదు, మీ
కు ప్రకృతిఁగోరి బల్లి యలకుంజను దెంతు రిదేటి నీతియో. 82

ఉ॥ పల్కెడు మెంతో దీనముగఁ బన్నుగఁ గార్యము తీఱునంతటన్
గుల్కుచుఁ బల్కరింపఁ దమకుంగల గౌరవ హానియంచు, వే
నల్కవహించు వారివలె నాకసమెత్తునఁ జూచుచుంద్రు, మీ
పల్కులు నమ్మఁగాఁ దగునె ప్రాజ్ఞుఁడ! తెల్పుమయాశయమ్ములన్

ఉ॥ ఇంతకు మున్ను చెప్పినవి యింకను దీఱకమున్నె పాప మీ
వింతల యెన్నికల్గవిలె, వెఱ్ఱులె లోకులు, కీలుబొమ్మలే,
సంతత మిట్లు మీపనులు సాగఁగఁ, దిండికి గుడ్డకుంగడున్
వంతలఁ గుందుచుం బ్రజలు వాసిచెడంగనుజూచుచుందురే. 84

చ॥ వలదని యెన్నియో వగల వాపిరి నెత్తిన నోరుపెట్టి, మే
మలజడి సేసిన న్వినక యన్నపుఁ గంట్రోలు నెత్తిరుద్దినా
రలవికిఁగాని యాఁకలికి నయ్యొ! యిఁకెంతఁగ నోర్చుకొందు మీ
పలు తెగలైన బాధలను బాపఁగ మార్గములున్నె తెల్పుమా.

చ॥ పదవికి వచ్చినంతటనె పల్కిర యెల్లరు "రామరాజ్య మిం
పొదవఁగ సాగు"నంచుఁ దుదకొందెను నూటికె లోటుగాని, తా
నది యొకవంక, లంచములకై పలుపోకలు నొక్కవంక, నీ
కొదవలు తీర్చువారెవరో, కుళ్లు తొలంగెడు మార్గమెద్దియో.

మ॥ తనరందియ్యఁగఁ జెప్పవచ్చుఁ దమ పం
తంబంతమౌఁ దాఁక, నా
దినముల్ చెల్లునె యెల్లకాలము, ప్రజా

ధీనంబు తంత్రంబు, నె
మ్మన మందుంబ్రజ గారవంబడరఁ బ్రో
వంజాలు పూతాత్ములన్
వినయంబొప్పఁగ నెన్నుకొందు మిఁక మా
విజ్ఞాపనం బింతయే. 87

వ॥ అని యనేక ప్రకారంబులఁబౌరులు తమ తమ యిష్టములం దెల్పు చుఁ బ్రజా ప్రభుత్వమునం గల పరిపాలనా విధానంబుల తారతమ్యంబులను నెత్తిచూపుచు, యోగ్యతలు తెలియక కన్నవారి నెన్నుకొనఁ జాలమని తమ యసమ్మతిని దెలియంజేయ మోహానుండు. 88

ఉ॥ ఊరక దూఱనేల, ప్రజకొప్పను, బాధ్యత లొప్పుచుండ, సాధారణమౌచు, నొక్కతెగ తప్పుల నెన్నిన లాభమేమి? మీతోరపు బాధ్యత ల్దెలిసి ధూర్తపథంబుల మానకున్న నే వారికి బాలనంబు తగుభంగుల సల్పఁగ సాధ్యమయ్యెడిన్. 89

ఆ॥ వె॥ ప్రజలు సహకరింపఁ బ్రభుతయుఁ జెడకుండుఁ
ప్రభుత మంచిదైనఁ బ్రజలుమెత్తు
రశ్వ మొప్పమంచి దగుచు రౌతుచెలంగు
రౌతు దిట్టయైన రంజిలునది. 90

తే॥ చెప్పి చేయుట పనిగాదు చెప్పకుండఁ
జేయుటయ గొప్ప యిలను సచ్ఛీలమదియ
యుఱుము మెఱుములతో మేఘుఁడొసఁగునెజల
మదియు లేనప్పుడొసఁగిన యట్లు జగతి. 91

ఉ॥ మిమ్ముల నింప నోట్లకయి, మేలు లభించునె దాన నిర్ధర్మ
వమ్ముగ మాటలిచ్చుటయు వంచన, చేయఁగఁ జేతనైన, సే
మమొమ్మడఁ గూర్చి మీకృపకు మానుగఁ బాత్రుఁడనౌదుఁగాని,
మీ నెమ్ముల నొప్పనేని, దయనిల్పి కృతార్థునిఁ జేయ వేఁడెదన్

వ॥ అని తన మనో నిశ్చయమ్మును బ్రజలకు నివేదించుచు గ్రామ
గ్రామమ్మునఁ బ్రచారమ్ము సాగించి తన యాశయమ్మును యథా
పూర్వంబుగాఁ బత్రికలం బ్రకటించి యెన్నికల దినంబున కెదురు
చూచు చుండెనంత. 93

ఉ॥ ఎన్నికనాఁడు పోటికయి యీర్ష్యలు పెల్లుగ సాగుచుండఁ, దా
నున్నతలంబునుండి యడుగొక్కటిగాని కదల్పకుండెఁ, దా
మెన్నిన మేలెఁగాక, మఱి యెన్నకయుండిన సంతసంబె, యం
చెన్నికలన్న నిట్టివగు నీసునఁ బోటికి నిల్వఁ బాడియే. 94

ఉ॥ ఎన్నికలయ్యె నొక్కదిన, మెంచఁగ నోట్లను, మోహనుండుపే
రెన్నికఁ గన్నవాఁడనఁగ నెక్కువ సంఖ్య జయించెనంచు నా
యెన్నిక శాఖవారు ప్రకటించిరి, మిత్రుల మానసంబులం
దున్న సమస్త మానవుల యుల్లము లుల్లసిలంగ వేడ్కతోఁ.

తే॥ అరయ మోహను పక్ష మత్యధిక సంఖ్యఁ
బరఁగు చుండుట రాష్ట్రంపుఁ బతి యతనిని
బిలిచి భారము నీదయ్యెఁ దెలిసి, యొప్పు
మంత్రివర్గము స్థాపించు మాన్య! యనియె! 96

—: మోహనుని రాష్ట్ర పాలనము. :—

ఉ॥ పెద్దలు, యోగ్యతల్దగు వివేకము, చాగములొప్పఁ జూచి మీ,

యొద్దిక నాకుఁ దోడుపడ నుద్దిగఁగూడి ప్రజాహితంబులన్
దిద్దుదమంచు నెంచితి మదిం దలపోసి హితంపుఁద్రోవ, మీ
గద్దెల నెక్కుఁడంచుఁ దమకంబున మంత్రుల నిర్ణయించిరన్.

ఉ॥ మంతురు లందఱుందగు ప్రమాణము సల్పుచు గద్దెలెక్కి, ధీ
మంతులు, యోగ్యులౌటను సమంబుగఁ బాలన, జేయఁగం బ్రజల్
సంతత తృప్తులై ముద మెసంగఁగ మోహను ధర్మపాలనం
బెంతొగ మెచ్చుకొంద్రు తమకంత విచారము తీఱెనంచెదన్.

ఉ॥ చీటికి మాటికిం బ్రజల చెంతల కేగఁడ, యేగనీఁడ, యే
నాఁటికి నేని నొక్కటి ఘనంబగు కార్యమొనర్పఁ బూనినన్
నాఁటికి బోయి ధర్మ పరిణామ పరిస్థితులొప్పఁ బల్కు, నా
మేట యశోకు పాలనము మించునటంచు జనుల్దలంపఁగన్. 99

ఉ॥ మెప్పుల కొప్పుకోఁడు, ప్రజమెచ్చిన కార్యము నిశ్చయించి తా
నొప్పుగఁ జేయఁబూను, మదినొప్పఁడు నిశ్చయమేదు కార్య
ముల్,-చెప్పుట యొక్కటై మఱలచేయుట యొక్కటిగాదు,
మాటికిం-ద్రిప్పఁడువేసియుత్తరువు,దిట్టలచిత్తముతొన్కఁజూచునే

మ॥ ఒక పక్షంబునఁజేరి ధర్మహానికై
యొప్పండెద న్మోహనుం
డకలంకంబగు బుద్ధిచేఁ బ్రజల క
త్యంతంబు మేలెంచి, బా
యక నిచ్చల్ తన తోడ మంత్రులకు ధ
ర్మ్యంబైన మార్గంబు, మా
నక చూపించుచుఁ బాలనంబెసఁగు ప్ర

జ్ఞ న్నల్పుచుండెందగన్. 101

శా॥ సారంబైన విచారముల్ సలిపి సం
చారంబు గావించి, యే
పారంగం బ్రజకేది యాహితము నే
వాకీడు యోచించి, ని
స్సారంబయ్యెడు కార్యముల్వదలి, మో
సంపాక దుశ్చింతలన్
శ్రీరంజిల్లఁగ మంత్రులొప్పిరి ప్రజా
సేవల్ దగంజేయుచున్. 102

ఉ॥ అచ్చుగనాస్త్ర వృక్షమున కంచిత శాఖలనేకముల్, జనుల్
మెచ్చఁగఁ దల్లిశాఖయగు విద్యకు గౌరవ మిచ్చి ప్రోవఁగన్,
హెచ్చె విశిష్ట విజ్ఞత మహాన్విధాత్మక మాచు వెల్గుచుణ్
మెచ్చిర యోజ్ఞలుందమదు మేల్మికిఁ దగ్గసుఖంబులబ్బఁగణ్. 103

ఉ॥ భారముతైన జీవికల పారముగా వెతఁగొల్పుచుండ, నా
హారము చాలకుండుటను నార్పఁగ సంకట మాన కట్టలం
బారుగఁ గట్టఁగంబుడమిఁ దారుల కెల్లర కబ్బె సౌఖ్యముల్
ధీరులు సర్వదా యెడరు తీర్చుటకే గద తల్చిరిచ్చులణ్. 104

ఉ॥ చీఁకటి బేరముల్ ముదిరి చిందులు త్రొక్కఁగఁ బల్లె పల్లెలం,
బ్రాకట పక్షపాతముల పద్ధతి పాలకులందు హెచ్చ, న
స్త్రాఁకటి కోర్వలేక ప్రజలార్వఁగఁ జూడము, మోహానప్రభుం
డేకపటంబు లేక ప్రజ కింపుగఁ బాలన సేయుచుండఁగణ్. 105

క॥ నూతన సంస్కారంబుల

బ్రాఁతిగ వ్యవసాయ మడరఁ బైరులు చెలగన్
ఖ్యాతి వెలుఁగఁగ దిక్కుల
నీతుల కిరవయ్యెఁ గృషికనివహము తలఁపన్. 106

సీ॥ చేతి పరిశ్రమల్ చెన్నొంద, సహకార
సంస్థలు సంప్రీతి సంఘటింప,
యంత్ర పరిశ్రమల్ హాయి వృద్ధిఁ గనంగఁ,
గార్మిక సంస్థలు కదురహింప,
రహదారు లచ్చమై వహియింప, రక్షణా
సౌకర్యములకునై శ్రేష్ఠఁ బూన,
రాక పోకలకు నిర్బంధముల్ సడలింప,
వస్తుసంతతులు సంపన్నములుగ

తే॥ సకల సౌకర్యములు ప్రీతి సంఘటింపఁ
గూడు గుడ్డలకై పొందు గోడు లెడలఁ
బ్రజలు నిర్బంధములు దీఱి పరఁగు చుంద్రు
రక్షణంబన నిట్టిదా రాష్ట్రమందు. 107

ఉ॥ ఆయము వృద్ధి సేయఁదగు నంచిత శాసన మొప్పిసేయఁగా
న్యాయపుఁ జింతలం బ్రజలు నాదర మొప్ప భజింత్రుగాని య
న్యాయపుఁ ద్రోవలం జనఁగ నారయ రెన్నఁటికేని దొంగ సా
రాయముఁ గాచువారలను ద్రాగెడు వారలఁ జూడ మచ్చటన్.

ఉ॥ దొంగలు మోసగాండ్రు మఱి ద్యూత విహారులు త్రాగుబోఁతులు
పొంగెడు లంచగొండులును భూమినిముందుకో? యంచునెల్లరె
న్నంగఁ దలిర్చు రాజ్యము ననందగి నిచ్చలు గ్రాలుచుండె స

త్సుంగవుఁడైన మోహనుఁడు ప్రాజ్యత రాజ్యమునేలు నత్తఱిన్.

ఎన్నఁగ దైవభక్తి, యలరించెడు నీతియు నొప్పుచుండ సం
పన్నతఁ గ్రాలుచుం జనులు ప్రౌఢి నెసంగుచు 'రామరాజ్యముం'
చెన్నఁగ రాష్ట్రమంతటను నేర్పఱ సౌఖ్యములబ్బ నిత్యమున్
సన్నుతి సేయగాఁ దనరెఁ జక్కని రాజ్యమనంగ నిద్ధరన్. 110

సీ॥ ధరనేలు ప్రభులు సద్ధర్మముల్ప్రచరింప
దైవ పాప భీతి తనరుచుండ
సత్కార్యముల నింప సత్కార్యముల సేవ
గలిసి మానవకోటి మెలఁగుచుండ
భోగంబులను గాని త్యాగంబులను గాని
సమభావముల తోడ జనులు నడువ
నెలమూఁడు వానల నిండారు పైరుల
నీతిబాధలు లేమి భీతి తొలఁగ

తే॥ మోహనుఁడు రాజ్య మేలఁగాఁ బుడమియందు
నన్నవస్త్రాల కఱవునకయ్యెఁ గఱవు
రాజ్యమొప్పెను శ్రీరామ రాజ్యమనఁగ
సకల సుఖముల నిలయమై జనులు పొగడ. 111

మోహము లేనిపండితులు మోసము లేని కులాంగనల్ మదిం
ద్రోహము లేని పౌరులును దోరపు ధర్మ సమృద్ధి గల్గ న
వ్యాహత దీక్షమైఁ బ్రజల నారయఁగంటిని చెప్పవోలె న
మ్మోహను ధర్మపాలనము ముజ్జగము ల్నుతియింప కుండునే.

తే॥ పశుసమృద్ధియుఁ జెన్నొందు భాగ్యవృద్ధి

గలిగి సుఖములఁ బౌరులు గాంచునట్లు
రాజ్యమును దీర్చె మోహన ప్రాజ్ఞుఁ డతఁడు
రామ రాజ్యంబు నాఁగ సద్రాజి పొగడ. 113

ఉ॥ తల్లులు వీర మాతలయి ధార్మికబుద్ధిఁ జెలంగుచుండ వ
ర్ధిల్లఁగ రాజ్యవైభవము ధీరులు కోవిదు లొప్పుచుండ సం
ధిల్లఁగ స్వార్థశూన్యత మదిన్ బ్రతిపౌరుఁడు సంతసింపఁగన్
జల్లఁగ మోహనుండతఁడు జాణతనంబున నేలె రాజ్యముల్. 114

మహాస్రగ్ధర:—తమి మించన్ బ్రాజ్ఞు లొప్పంధరను సమల స
ద్ధర్మ రక్షా విభూతిన్
సమతల్ భూమిం జెలంగన్ సతత సరసతా
సంపదల్ చెంగలింపన్
గమనీయంబైన ప్రేమల్గలిగి వెలయ నా
కాంక్షితంబుల్ పొసంగన్
విమలంబౌ నీతి నిచ్చల్ విలసిలి తనరన్
నేమ్మి రాముం దలంపున్. 115

ఉత్సాహము:—రామభద్ర! నిన్నుఁదలఁప రమ్యమైన సంపదల్
క్షేమముల్ పొసంగు ననుచుఁ జిత్తమందు నిల్పితిన్
గామితంబులొసఁగి నన్నుఁగరుణఁ బ్రోవు రాఘవా!
నీమహత్తు లెఱుఁగఁ దఱమె నిశ్చయంబు మాధవా!

గద్యము:—ఇది శ్రీ భారద్వాజగోత్ర పవిత్ర, ఆపస్తంబసూత్ర, రాఘ
వాచార్య ద్వితీయ తనూజ శ్రీరామచంద్ర కరుణా కటాక్ష
లబ్ధ కవితా విస్ఫురణ కాందూరు నరసింహాచార్య ప్రణీ

తంజైన మోహన విజయంబునందుఁ దృతీయాశ్వాసము.

సంపూర్ణము.

ఓం శాంతిః శాంతిః శాంతిః.



జ్యోతి ముద్రాక్షరశాల, జమ్మలమడుగు. ప్రతులు 1000.






# అన్ని విధములైన
# అచ్చుపనులకు
# జ్యోతి ముద్రాక్షర శాలలో

నూతనాక్షరములతోను, పలురకములగు బ్లాకులతోను, కూడి యుండు మా జ్యోతి ప్రెస్‌లో తెలుగు, ఇంగ్లీషు, హిందీ, సంస్కృతభాషలలో మీకు నచ్చులాగున ముద్దు లొలుకు అక్షరములతో ముద్రించి సర్వులకు అందుబాటుగా స్వల్పధరలతో సకాలమునకు అందజేయగలము. మరియు కనులకు మిరుమిట్లు గొల్పు కలరు ప్రింటింగులును, అందమగు బైండింగులును, తయారుచేసి ఇవ్వగలము. మా జ్యోతి ప్రెస్‌లో అచ్చుపనులను ఒకసారి మీరు చూడగలిగిన ఆర్డర్లు ఇచ్చుటకు మీలో ఆతురత కలుగక మానదు.

అన్ని విషయములకు

జ్యోతి ప్రింటింగ్ ప్రెస్, జమ్మలమడుగు.

ప్రొప్రయిటర్,

కె. రామయ్య,